# నా జీవితంలో ప్రయత్నాలు - ప్రయోగాలు



ఆ త్మ క థ

(మొదటి భాగము)



పోతుకూచి సాంబశివరావు

ప్రథమ ముద్రణ :
ఫిబ్రవరి 1980

ముఖచిత్రం :
వి. ఎస్. ప్రకాష్.

వెల : రు. 5-50

ప్రతులకు :
పోతుకూచి ఏజన్సీస్
208, న్యూబోయిగుడా
సికింద్రాబాదు-3.

ప్రింటర్స్ :
మెట్రో ప్రింటర్స్,
విజయవాడ-2.

# అంకితం

నన్ను

సృష్టించిన

ఆ పరబ్రహ్మకు.

# ఆత్మకథకు అనుకంపన

ఎందరో జగతిలో జన్మిస్తారు. చనిపోతారు. కాని ఎందరి ఆత్మకథలు రసవత్తరంగా వుంటాయి? అయినా ఎందరు తమ ఆత్మకథలు వ్రాయ పూనుకున్నారు? తాతలు తమ జీవితాల్లోని వివిధ సంఘటనలు 'మా కాలంలో' అని చెబుతూంటే యువకులు వింటుంటారు ఆనందిస్తారు. కాని సాహితీ విలువలతో రసవత్తరమైన వాస్తవిక గాథలుగా చిత్రిస్తూ ఆత్మకథ రచన చేయడం నా ప్రయత్నం. ఆత్మ కథలో కూడా కొన్ని నిజాలు దాచేస్తారనే ప్రతీతి వుంది. కానీ ఏదీ దాచకుండా, ఏ భావం వెనుకంజ వేయకుండా, జ్ఞాపకం వున్నంతవరకు స్పష్టంగా, నిర్మొహమాటంగా, సత్యంగా అందించడానికి ప్రయత్నం చేశాను.

ఇది మొదటి భాగం. మా నాన్న చనిపోయేదాకా, ఉన్న జీవిత భావాలు, గాథలు ఇందులో చిత్రించబడ్డాయి. హృదయానికి కూడా ఆవేదన సానపట్టినదే, భావాలు పొంగుల్లారావు. పొంగులు ఆరిపోకుండా గుండెల అంచుల్ని పనిపిస్తూ వుండాలి. బాల్యంలోని అనేక ఘట్టాలూ నా స్మృతి కథంలో వుండిపోయినవే.

భవిష్యత్తులో కూడా సమకాలీన వ్యక్తుల గురించి వ్రాయవలసి వచ్చినప్పుడు కూడా భావాలు దాచకుండా, సత్యాలు నిష్పాక్షికంగా చెప్పడానికి ప్రయత్నం చేస్తాను. అయితే ఏ సంఘటన అయినా అదే కోవకు చెందిన కొద్ది మంది పాఠకులనైనా కదిలిస్తే ఈ ఆత్మకథకు కొంత విశిష్టత చేకూరిందనే నా భావన. జీవితంలో వ్యక్తికి వివిధ రంగాలలో ప్రవేశం, అనేక వ్యక్తులతో పరిచయం, అనేక సంఘటనలలో భాగస్వామిగా వుండడం, అనేక ఉద్యమాలతో పరిచయం ఏర్పడడం, ఆ వ్యక్తి జీవితానికి పరిపుష్టత యిస్తుంది. నా జీవితం కూడా అనేక అనుభూతుల ప్రపంచంలో విహరించింది. కొన్ని చోట్ల అంచులు స్పృశించి పయనించింది.

ఈ ఆత్మకథ అంతరాత్మ ఆవేదన. అందరికీ ప్రయోజనకారి కాగలిగితే నా ప్రయత్నం సఫలమైనట్లే. చరిత్రగా కాకపోయినా "వాస్తవిక గాథల సంపుటి"గా నైనా ఈ ఆత్మకథ నిలిస్తే నాకు సంతోషమే. ఈ గ్రంథ ప్రచురణలో సహకరించిన శ్రీ ఉప్పలూరి మార్కండేయులుగారికి అనుమతి లేకుండా అంకితమిచ్చినా స్వీకరించిన ఆ పరబ్రహ్మకు నా కృతజ్ఞతలు.

# పోతుకూచి సాంబశివరావు రచించిన

## ముద్రిత గ్రంథాలు :

నవలలు:

1. ఉదయ కిరణాలు, 2. ఏడురోజుల మజిలీ, 3. అన్వేషణం.

కథల సంపుటాలు :

1. సాంబశివరావు కథలు, 2. బ్రతుకుల పతనం, 3. ఎదురు ప్రశ్నలు, 4. శేఖరం కథలు (రెండు సంపుటాలు) 5. క్రొత్త విలువల బ్రతుకు. 6. మందారాలు.

కవితా సంపుటాలు :

1. రాసి సిరా, 2. అనురాగం-అను-రాగం (గేయాలు), 3. పోతుకూచీయం (ఆట వెలది శతకం) 4. శిఖరాలు, 5. సాంబశివానందలహరి.

నాటికలు :

1. ఇదీతంతు. 2. పసుసున్నలు, 3. దొంగ, 4. దొర
5. ఏకపాత్రాభినయాలు, 6. మూడు నాటికలు.

నాటకాలు :

1. పల్లె కదిలింది, 2. హంతకులు.

వ్యాసాలు :

వాట్ డు యు నో ఎబౌట్ లేబర్ (అమెరికన్ గ్రంథం అనువాదం)

సినీ నవలలు :

1. తండ్రులు కొడుకులు, 2. కలసివుంటే కలదు సుఖం.

త్వరలో ముద్రితాలు :

చలమయ్య షష్ఠిపూర్తి (నవల) స్వగతాలు - గల్పికలు (కథలు) నా జీవితంలో ప్రయత్నాలూ - ప్రయోగాలు (ఆత్మకథ రెండవ సంపుటం)

వివరాలకు :

పోతుకూచి ఏజన్సీస్,
208, న్యూబోయిగూడ,
సికింద్రాబాదు-3.

# నా జీవితంలోని ప్రయత్నాలూ - ప్రయోగాలూ

నాంది

కథలు వ్రాసేవారు జీవితగాథలు వ్రాయనక్కర లేదు వారి రచనల్లోనే యాంత్రికంగా జీవితగాథలు దొర్లి పోతుంటాయి. జీవితంలోని సంఘటనలు ఆధారంగా కల్పన అలంకరణలతో తీర్చి దిద్దబడిన కథలు సాహిత్య ప్రయో జనం కోసమై వెలువడుతాయి. కల్పనలే కాకుండా వెలు వడిన జీవితసంఘటనలు సాంఘిక ప్రయోజనం పొందగలవ్వని జీవితంలోని కొన్ని సంఘటనలు సాహిత్యంగా రూపొందించ డం సాధ్యంకాదు. అందుకే యీ రచన.

బాల్యంనుంచి కాలగమనంలో ప్రస్తుతందాకా జీవి తంలో అనుభవ వైవిధ్యం పొందిన వ్యక్తికి తన అను భూతులు ఇతరులతో పెంచుకోవాలన్న ఆసక్తి కలుగు తుంది. ఆ ప్రేరేపణే జీవితంలోని ప్రయత్నాలూ-ప్రయో గాలు వరికూర్చి అందించాలనేఆకాంక్ష నాలోకలిగించింది.

## బాల్యదశ

ఎక్కడపుట్టావు? అన్నప్రశ్న ప్రతివానికి జీవితంలో ఎదురౌతుంది. మంచివానికీ చెడువానికీ కూడా ఈ ప్రశ్న మామూలే, కాని పుట్టిన స్థలంబట్టి వ్యక్తిరూపొందుతాడా? పరిసరాలు, చుట్టూవున్న సంఘం, స్వయంప్రతిభ, చదువు సంస్కారం మున్నగునవి వ్యక్తిత్వం పెంచినా, ఎక్కడపుట్టి పెరిగాడో, ఆవాతావరణం మనస్సుమీద గాఢంగా ప్రతి వ్యక్తికీ నాటుకు పోవడం సహజం.

నేను పుట్టింది ఒక పల్లెటూరు. ఆ పల్లెటూరు గోదావరి చరిత్రలో ఒక ప్రసిద్ధ వారధి సాధించింది. ఉభయ గోదావరి జిల్లా నూ కలిపే బ్రిడ్జికి ప్రాధాన్యత నిచ్చిన గ్రామం ఆలమూరు నా జన్మస్థలం. ఎవరు ఎలా జన్మించారో తలి దండ్రులు చెబుతుంటారు. నేను చాలా కంగారుగా పుట్టి రోకలిగుంటలో జారిపడ్డానట— ఆపుట్టుక కథ జ్ఞాపకం వస్తూంటే అనిపిస్తుంది జీవితం గోతులమయం అని. పడి లేస్తూ సాగించేజీవిత గమనం ఒకపోరాటం లాంటిది అదే నాకు తారసిల్లిన జీవనప్రగతి.

## మరణంతో పోరాటం

నాకు రెండు సంవత్సరాల వయస్సు వచ్చినపుడు ఒళ్ళంతా నీరు పట్టిందట. ఒకరోజు యింక యీప్రాణి బ్రతకడం కష్టమని ఇంటిబయట వీధివైపు ఒక గుడారంఏర్పరచి

మా అమ్మమ్మ పల్లమ్మగారు, నన్ను ఒడిలో పడుకోబెట్టుకొని నా అంతిమ యాత్రకు వల వలా వాపోతుందిట—యింకా శ్వాస ఆడుతూండడంవల్ల, మూడు రోజులు వీధిలో కూర్చున్నా, నన్ను చనిపోయినవానిలా భావించలేక బ్రతికివున్న వానిగా జమకట్టలేక ఇంటిల్లిపాదీ బాధపడుతున్నారట. మా తండ్రి తన జీవితకార్య కలాపాలలో నిమగ్నులయినట్లు నటిస్తూ ఏం తోచక అటూ ఇటూ తిరుగుతూంటే మా అమ్మ ఆయన్ను వేధించి, ఊళ్ళోని ఆయుర్వేద వైద్యుని వద్దకుపోయి ఏదైనా మందు చివరిసారిగా తెమ్మని ప్రాధేయ పడిందట. ఆయనకు ఏమీ తోచక ఆయుర్వేద వైద్యుని చేరి విసిగించగా ఆయన నా బ్రతుకుపై నిరాశ వెలిబుచ్చినా చివరకు ఆ వైద్యుడికీ ఏమీ తోచక ఒక సితాంశ రసం మాత్రం వేయమని యిచ్చాడట.

ఆ మాత్రతో నా వైకుంఠ యాత్రకు అడ్డుకట్ట ఏర్పడి నేను బ్రతికానట. కొంచెం పెద్దయ్యాక మా అమ్మమ్మ ఒడిలో కూర్చుని సాయంత్రం ఆమె పెట్టిన పటిక బెల్లం, లవంగాలు తింటూంటే, నీకు దీర్ఘాయువు వుందిరా! అంటూ మా అమ్మమ్మ ఈ కథ ఏకరవు పెట్టేది.

చనిపోవలసినవాడు బ్రతికితే, బ్రతుకులో ఏదో సాధించ డానికి బ్రతుకుతున్నాడు అని అనుకోడం సహజం. పూర్వ కాలంలో శిశుమరణాలు ఎక్కువగా ఉండేవి. వైద్య సౌక ర్యాలు నేటిలా లేనందువల్ల నా ఎరుకలో మా అమ్మ కడుపున బుట్టిన ముగ్గురు శిశువులు చనిపోవడం నేను

చూశాను. మొత్తంమీద అటువంటి బాలారిష్టాలకు నేను తట్టుకోగలిగేనట.

## అమ్మాయిలా అలంకరణ

మా అమ్మకు నేను పెద్ద కొడుకును నాకు అక్కయ్య వుంది. ఆమె పేరు భానుమతి. భాను అని యింట్లో పిలిచే వారామెను. నాకు అక్కయ్య వున్నా, పూర్వకాల పద్ధతి వల్లనో, లేక ఆడపిల్లపై మోజువల్లనో మా అమ్మ నాకు జడవేసి నెత్తిమీద సిగ జడకు పూలు పెట్టి, కాలికి గజ్జెలు, చేతికి మురుగులు తగిలించి గారాబంగా చూసేవారని పెద్దయ్యాక నా చిన్ననాటి అటువంటి ఫోటో ఒకటి చూసుకున్నాక అనుకున్నాను. నేను బోరగిలా పడుకునే వాడినని, కాళ్ళు ముడుచుకు పడుకునే వాడినని, శిశు ప్రేమతోఅన్న అమ్మ మాటలు అప్పుడప్పుడు జ్ఞప్తికి వస్తాయి అయితే ఆ పరిస్థితికి సంకేతంగా చాలాకాలం చాలా పిరికి పందలా వుండేవాడినని నాకు గుర్తు గట్టిగా ఎవరితో మాట్లాడలేకపోవడం, అనవసరంగా అల్లరిచేయడం, కబుర్లు చెప్పడం, చంటిపిల్లల లక్షణాలు నాలో కొన్నాయంట. చిన్న తనంలో అయితే మా నాన్న నా జాతకం వేయించి, ఫరవా లేదు, మా వాడు ఘటికుడౌతాడు అని, గర్వపడేవారట.

అది నిజమో కాదో ఏమోగానీ, మావాళ్ళు నా మాంద్యానికి బాధపడకుండా మానాన్న అలా చెప్పేవా రేమో అని అందరూ అనుకునేవారట. ఏమైనా చిన్ననాడు,

ఆలోచనలు మొలకలు ఎత్తే సమయంలో చూసిన విషయాలు, పొందిన అనుభవాలు హృదిలో చెరగని ముద్ర వేస్తాయి.

## చదువు సంధ్యలు

సాధారణంగా ఆరోజుల్లో ఐదవఏడు రాగానే అక్షరాభ్యాసం చేయడం పరిపాటి. అలాగే నాకు కూడా చేయించారు. నాకు జ్ఞాపకం- పిండివేసి- ఆపిండిలో మొదట ఓం- నమశ్శివాయ, వేలుతో దిద్దించారు. చిన్నతనంనాటి జ్ఞాపకశక్తి వల్లననుకుంటా- ఏది చదివినా మళ్ళీ కంఠోపాఠం చెప్పేవాడినని, ఒకసారి అక్షరం నేర్చుకొంటే గుర్తుపెట్టి మళ్ళీ గబగబా చదివేసేవాడినని మావాళ్ళు అంటారు. అయితే గట్టిగా బయటకు వినిపించేలా చదివితే అది ఒక గొప్పగా భావించి, అందరూ నన్ను బుద్ధిమంతుడంటారు కదా అని ఆ ప్రయత్నం చేసేవాడినని గుర్తు. మా యింటి వీధివైపు కిటికీ దగ్గర నిలబడి వచ్చేపోయే జనం వినేలా గట్టిగా చదవడం నాకు జ్ఞాపకం. గబ గబా అక్షరాలు కలిపి చదువగలిగినా నాకు అర్థంకావడం కష్టమయ్యేది.

## రాంరాం మేష్టారు

మరి నాకు మొదటి గురువు ఎవరో గుర్తు లేదు. మొత్తంమీద మనస్సులో నాటుకుపోయిన మాష్టారు పేరు నాకు తెలియదు కాని, ఆయన్ను రాంరాం మాష్టారు అనేవా

రం. మావీధికి సమాంతర రేఖలా వున్న మరో వీధిలో రాం రాం మేష్టారి యిల్లు ఉండేది. ఆయన ఇంటి అరుగుల మీద, ఎదురి టి అరుగుల మీద, ఎంతో మంది పిల్లలు చదువు కుంటూండేవారు.

అంతమంది పిల్లలున్న ఆ బడిలో ఏదో 'ఝుంఝుం'మని రణగొణధ్వని శబ్దాలు వస్తూండేవి. పిల్లలంతా మాట్లాడు కోవడం మెల్లిగా పాఠాలు వల్లించడం వల్ల అదోరకమైన శబ్దం వీనులకు వింతగా ఉండేది. నాకొక్కసారి నిద్ర కూడా వచ్చేది. రాంరాం మేష్టారు ఏ పాఠాలు చెప్పారో నాకు గుర్తులేదు. కానీ ఎక్కాలు, చిన్న చిన్న పాఠాలు తెలుగు, ఇంగ్లీషు ఆయన దగ్గర నేర్చుకున్నాను. అయితే ఆయన ప్రతి శుక్రవారం సాయంత్రం పిల్లలందరిచేత భజన చేయించే వారు. ఆ భజన పూర్తిఅయ్యాకనే పిల్లలు ఇంటికి వెళ్ళాలి.

నాకు పాఠాల కంటే 'రామభజన' తర్వాత పెట్టే ప్రసాదం ఎక్కువ రుచిగా వుండేది. సాయంత్రం ఆకలివల్ల ప్రసాదం ఎక్కువ తినాలంటే నాకు ఎక్కువ పెట్టేవారు కాదు అలాగే అందరి పిల్లలకు కూడా అప్పుడప్పుడు భజ నలకు ఇంటివద్దనుంచి ప్రత్యేక రుసుము తెమ్మని అడిగేవారని కూడా గుర్తు

నాకు ఇంగ్లీషు, తెలుగు, చదువులు బాగానే వచ్చేవి. కాని లెక్కలు బాగా వచ్చేవి కావు ఎక్కాలు పూజ్యం రాంరాం మేష్టారు నా మందబుద్ధికి ఉగ్రుడై పోయేవారు. వీలైనంతవరకు నా తొడలు మెలికలుతిప్పి, పిక్కపాశాలు

జాస్తిగా పెట్టేవారు. ఆ తొడపాశం భరించలేనంత బాధగా వుండి తొడలు ఎర్రబడి వాచిపోయేవి. అలాగే గోడకుర్చీ వేయించేవారు అది నా కాళ్ళ శక్తిని పరిక్షించేది, ఒక్కొక్క సారి ఇంటికి వెడితే, నా ఎరుపైన పిక్కపాశాలు, రక్తము గల తొడలు, వణికే కాళ్ళు, పైగా తే దవడమీద చేతివేళ్ళ ముద్రలు చూచిన మాఅమ్మ, నాన్న కొంచెం బాధపడేవారు. అయితే చివరకు ఎందుకో ఆక్కడ నాకువిజ్ఞానం సరిగా కల గటం లేదని అనుకుంటూ మాన్పించేశారు.

రాంరాం మేష్టారి భార్య ఒకావిడ చాలా తెల్లగా వుండేది. మేష్టారిమీద ఉన్న భక్తి ఆమె మీదకూడా పిల్ల లందరికి ఉండవలసిందేనురి, బజారు వ్యవహారాలన్నీ శిష్యు లకు పురమాయించి చేయించుకునేది ఆవిడ. కొంచెకుర్ర వాళ్ళు నాకంటే మూడింతల వయస్సుగల పెద్దవాళ్ళు కూడా నాతో చదువుకునే ఘనత సంపాదించుకున్నా ఆ పెద్దకుర్రాళ్ళు మేష్టారికి అన్నిరకాల గృహ సౌకర్యాలు సమకూర్చేవారు. అదే కాకుండా కొంచెం వయసు మీరటం వల్ల రాంరాం మేష్టారి భార్య గురించి కొంచెగా శృంగా రగా రహస్యంగా మాట్లాడి ముమ్మల్ని నవ్వించేవారు. ఆ గోజుల్లో శృంగారం అంటే ఏమిటో తెలియక పోయినా, వారి ఛలోక్తులకు నవ్వు వచ్చేది ఆ నవ్వులు రాంరాం మేష్టారి దృష్టినపడితే కథ సంగతి తెలియక పోయినా మా వీపులు విమానం మ్రోతమ్రోగేవి.

## గవరమ్మ - కరివేపాకు

మా ఇంటికి ప్రక్క వీధిలో మా గవరమ్మమ్మ ఉండేది. ఆవిడ మా అమ్మమ్మకు స్వయంగా చెల్లెలు. ముసుగు వేసుకువున్న విత్తంతువు ఆమెకు కూతురు ఆ కూతురుకు ఒక కూతురు- మొత్తం ఆ ఇంట్లో ముగ్గురూ ఆడవాళ్ళే వుండేవారు. ఆ ఇంటికి మా ఇంటికి పెత్తనాల రాయబారాలు తరుచు జరుగుతుండేవి. గవరమ్మగారి ఇల్లు చాలా పెద్దది. ఒక పాక ఇల్లు- వెనకాల పెద్దదొడ్డి- ఆ దొడ్లో అనేక పూలచెట్లు, పళ్ళ చెట్లు- చూడటానికి సరదాగా వుండేది ఆ ఇల్లు. ఆమెయింట్లో కరివేపాకు తెమ్మని నన్ను రాయబారిగా మా అమ్మ పంపుతూ వుండేది. పొయ్యిమీద కూర పెట్టి కరివేపాకు లేదన్నది గుర్తుకు వచ్చి, తక్షణం తెమ్మని మా అమ్మ పురమాయించడం; కంకర రోడ్డుమీద పరుగెత్తుకెళ్ళి, ఆ రోడ్డు దగ్గరలోన వున్న నాగుల చెరువు, పొడుగాటి రావిచెట్లు, మారేడుచెట్ల పిల్ల గాలులు పీల్చుకొంటూ, ఉరుకు ఉరుకున పోయేవాడిని. గవరమ్మగారి తలుపుకొట్టగానే మా దొడ్డమ్మ ఎదురయి తక్షణం కొమ్మవంచి కరివేపాకు ఇచ్చి పంపేది. అమాయకత్వం, ఆప్యాయతకు వారు ప్రతిబింబులుగా కనిపించేవారు. మధ్యాహ్నం గవరమ్మగారు మాయింటికి తరచు పెత్తనాలకు వచ్చేవారు. కూతురు మనుమరాలు సహితంగా- కాఫీగా భోజనాలయినాక, ఏం వంటకాలు చేశారు- అన్న ప్రశ్నలు పూర్తి చేసుకుని, ఊళ్ళో గొడవలు అన్నీ మాట్లాడుకునేవారు. అవిడ అల్లుడు ఎక్కడికో పోయాడని ఎప్పుడు వస్తాడూ అంటూ ఆ

గవరమ్మగారు కలవరిస్తూవుండేది. చెవిలో గోదవెక్కువ– చెముడు పెరిగి పోతుంది అంటూ చెవిలోంచి గులిమి తీసు కుంటూ పెంకు లెగిరి పోయేలా ఆవిడ మాట్లాడటం – ఆవిడ కోసం మా వాళ్ళు మాట్లాడుకోవడం నేను చోద్యంగా చూస్తూ వింటూండే వాడిని. నన్ను మాత్రం 'బుద్ధిమంతు డని' అందరూ అనేవారు; ఏ అల్లరిచేసే ఆలోచనా శక్తి లేనందువల్ల–అప్పుడే మాఅమ్మ మాఇంట్లో వున్న కళ్ళ– లేదా దొడ్లో కాసిన దానిమ్మ పండ్లు ఆవిడకు అప్యాయంగా సమర్పించుకుంటూండేది– ఆవిడను మరో చెవిటి స్నేహితు రాలు మాఇంట్లోనే ఉండేది. ఆవిడ మానాన్నగారి దత్త తల్లి మూర్తెమ్మ, ఈ ముసలి వారిద్దరూ మాట్లాడుకుంటుంటే దారిన పోయేవారు దద్దరిల్లి ఇంట్లోకి తొంగి చూచి నవ్వుకొని వెళ్ళిపోతుండేవారు. ఆ ఇద్దరికీ చాదస్తం అనంతం. మాది పెంకుటిల్లు, వీధి వైపు గదులలోన, వరండా పెద్ద దొడ్డి నీళ్ళ పంపు అరటి, దానిమ్మ, మల్లె, సీతాఫలాల చెట్లు– ఒక చిన్నపాక, ఇదీ దానిస్వరూపం. వచ్చే బంధు మిత్రులు వరండాలో చాపపై కూర్చుని కబుర్లు చెప్పుకునే వారు. మా ఇంటి గుమ్మం దగ్గనే మా మామ్మగారి గది. ఆవిడ భోంచేసి కూర్చుంటే ఏ ధ్వని వినిపించినా వినిపించక పోయినా 'ఎవరు వారు?' అని హెచ్చరిక చేసేది. ఆవిడకు

వచ్చిన అగంతకులు తమ పేరు వివరాలు చెప్పి, ఆవిడ అను మతితో మా ఇంటి లోపలికి నడిచి వచ్చేవారు. వెళ్ళిపోయేట ప్పుడు ప్రతివారు మూర్తెమ్మ గారిని పలకరించడం— మా యిలు ఇది ఒక వింతగా వుండేది నాకు.

మా మామ్మగారి భర్త పేరు నాకు పెట్టారట. ఆయన పేరు సాంబయ్య, దానికి కొంచెం నాగరికత జోడించి నాకు ప్రస్తుతం పేరు పెట్టారట. నేను చోద్యంగా నడిచి అలా వెడు తున్నా, అక్కడ నిలుచున్నా, మా వాళ్ళు మా మామ్మగారిని పరియాచకం చేశేవారు 'ఇదిగో నమ్మా మీ మొగుడుగారు వస్తున్నార'ని మా మూర్తెమ్మ మామ్మ పక పకా నవ్వి, నన్ను దగ్గరకు రమ్మనేది కాని నాకేదో బిడియం, భయం వేసేది. ఆవిడకు అప్పటికే డెబ్బై ఏళ్ళు దాటిన ముసలి. కాండ్ర పెట్టినపుడు, తాయిలాలు పెట్టినపుడు, ఆవిడ పిలవక పోయినా వెళ్ళేవాడిని, కాని యీ పరియాచక సమయాలలో నాకు ఏదో ఎబ్బెట్టుగా వుండేది. మా తాత సాంబయ్య గురించి నాకేమీ తెలియదు.

మా గవరమ్మమ్మ, మా మూర్తెమ్మమామ్మ. బాగా ప సుముదుసలులైనా నామదిలో వారిరూపాలు చాలాచిత్రంగా హత్తుకుపోయాయి. వారిగురించి నాకథల్లో కొన్ని విచిత్రమైన పాత్రలు కూడా దొర్లాయ్. "బ్రతుకుల పతనం" అనే నా

కథలో గవరమ్మమ్మ ప్రతిక బింబించింది. ఉదయకిరణాలు నవలలోనూ, ఇతర కథల్లోనూ మూర్తెమ్మ ఒక్కొక్క చోట తొంగిచూసింది. విచిత్ర పాత్రల్లో నా జీవితగమనం పరిశీలిస్తుంటే, మామూర్తెమ్మ మామ్మగారి తాండ్ర, గవరమ్మగారి కరివేపాకు జ్ఞాపకం వస్తాయి.

కరివేపాకు తెస్తున్నప్పుడల్లా దాని సువాసన చూసేవాడిని: తాండ్ర రుచికి మురిసి బాగా తినేవాడిని. ఈ రెండు ప్రతిబింబాలు నా జీవిత గమనంలో కనిపిస్తాయి. కరివేపాకులా వాడబడటం మామిడి రసంలా పిండబడి ఎండబెట్టబడటం. ఈలక్షణాలు యీబ్రతుకు ప్రయాణంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇదేకాదు బహుశా ఈప్రజాస్వామ్య నాగరిక జీవనంలో చాలామంది జీవితాలు ఇలానేవుంటాయేమో అన్నది అతిశయోక్తికూడా కాదు. ప్రతిభకు, ప్రతిభకు తగ్గఫలిత సంపాదనకు చాలా తేడా వుంది. నిస్వార్థసేవ ఉత్తమ ఆదర్శమే కాని ఫలిత శూన్యమైనప్పుడు ఆ ఆశయం గురించి పునరాలోచన ఏర్పడుతుంది. గాంధీజీ జీవితం పునరాలోచన లేకుండానే నడిచిపోయింది. జీవితాలు ఎలా వున్నా, కొందరి జీవితాలు ఇంతే అయితే వీరు మమతలకు పెన్నిధులై, కరుణాసాగరంలో ఈది తేలుతుంటారు. ప్రపంచం రంగుల విష్ణుచక్రం. అందులో ఏదో ఒక రంగులో ఇటువంటివారు ప్రతిబింబిస్తుంటారు.

# భక్తి - భజనలు

చిన్నతనంనుంచి నాకు దైవభక్తి ఎక్కువ. దానికి కారణం బహుశా మాఅమ్మగారు యిచ్చిన శిక్షణకావచ్చు. ఆమె పూజలు చేసుకునేది మమ్మల్ని హరికథలకు, తోలు బొమ్మలాటలకు, గుడులకు నిత్యంతీసుకు వెలుతుండేది. మా నాన్నగారు కూడాభక్తిపరులే. ఆయన అనేక భజనల్లో పాల్గొని పాటలు పాడుతుండేవారు. ఆగ్రామంలో ఒకవిధంగా మానాన్నగారిని మంచిగాయకుడిగా జమకట్టేవారు. భజనలు జరిగినప్పుడు నేను విడ్డూరంగా దేవుళ్ళ ఫొటోలవైపు చూస్తూండేవాడిని. శివుడికి పాములు, నెత్తిమీదగంగ విష్ణుకు నాలుగుచేతులు ఎలా వుండేవి అని నా అనుమానం, ఆ రోజుల్లో ఈ రోజుల్లోకూడా వారిని నేను చూడలేదు కనుక ఆ ప్రశ్నకు జవాబు నాకు దొరకలేదు, మామూలు అలవాటు ప్రకారం భజన చివరదాకా ఉండి, ప్రసాదం పుచ్చుకుని తినేవాడిని. ఒకసారి మా యింటికి ఎదురుగా ఒకరి ఇంట్లో భజన జరుగుతుంది. బహుశా ఆ భజన, శివుడి గురించో, శ్రీక హారనాధ్ బాబా గురించో నాకు సరిగా గుర్తులేదు. ఒకొక్కరు కొంతమంది పూనకం వచ్చినట్లు ప్రవర్తించారు. మనిషి పూనినప్పుడు

జనం అంతా చుట్టూచేరి హడావుడిచేసి, నెత్తిమీద నీళ్ళని చల్లి, హారతియిచ్చి, గందరగోళం చేసేవారు. తరువాత ఒక మహావీరుడిలా అతను కళ్ళు తెరిచి తనకు దేవుడు కనిపించాడని ఏదో చెప్పాడని చెప్పేవారు. అలా పూనిన వ్యక్తులకు బ్రహ్మరథం పట్టేవారందరూ. ఈ దృశ్యం నన్ను కదిలించింది. ఆగౌరవం నాకుకూడా ఎందుకు దక్కరాదూ ఆనేభావన నాలో కలిగింది. అలా భజన ఏర్పాటు చేసిన ఒక సందర్భంలోనాకు పూనికవచ్చినట్లు నటించాను. కాళ్ళు చేతులూ, గిలగిలా కొట్టుకున్నాను. మూల్గుతూ, అరిచాను. నిద్రమత్తులో వున్నట్లు పడిపోయాను. నాకు కూడా హారతులిచ్చారు. కొబ్బరికాయలు కొట్టి నీళ్ళు నామీద పోశారు. చివరకు వీరుడిలా ముఖంపెట్టి నేను కళ్ళు తెరిచాను. పూనినపుడు ఏంజరిగిందిఅని నన్ను ప్రశ్నించారంతా. శ్రీరాముడు లక్ష్మణుడు, సీత ప్రత్యక్షంగా కనిపించారని చెప్పా. నీకేం కావాలి అంటే నాకు మీ పూజకావాలి అన్నానని, బొంకాను-అందరూ నన్ను చూసి నవ్వారు. శివుడిగురించి భజన చేస్తుంటే రాముడు ఎలా కనిపించాడురా అన్నారు అంతా. ఏమనగలను-?

ఇప్పుడు ఇద్దరూ ఒకటేఅనగలను. అప్పుడు కళ్ళు తేలవేసి వచ్చేశాను. నాపూనకం దొంగపూనకం అనుకున్నా

లేమో కూడా — కానీ నాకు రాముడి మీద చాలా భక్తి ఉండేది. దానికి కారణం మా రాంరాం మేష్టారే. ఆయన ఇంటి అరుగుమీద కూర్చుని భజన చేస్తుంటే, ఏదో మెరుపులా ఒకసారి ఆకాశంలో శ్రీ సీతాస్వరూపాలు కళ్ళకు ఒక క్షణం కనిపించినట్లు లీలగా గుర్తు — అది నిజమంటే ఎవరు నమ్ముతారు?

అప్పుడైనా — ఇప్పుడైనా అంతే. అయినా నాకు మాత్రం భక్తిభావం అపరిమితంగా జీవితంలో పెరిగిపోయింది. దేవుని స్మరించి, హృదయంలో ఆ నామము వాచనం చేసుకుంటూంటే ఏదో ఆనంద భాష్పాలు రాలుతుండేవి చిన్నప్పుడు విన్న పౌరాణికగాథలలోని కృష్ణలీలలు, రామచరిత్ర నన్ను సమ్మోహితుని చేశాయి. అటువంటి లీలలు చేయగలిగితే ఎంత బాగుంటుంది అనిపించేది. ముఖ్యంగా దుర్మార్గులు, దొంగలగురించి విన్నప్పుడు నా ఎరుకలో ముసలివారు — పెద్దలు — కొందరు రామకోటి వ్రాయడం నాకుగుర్తు. భయంవేసినప్పుడు నేను 'రామ' జపం చేయడం ఆరోజుల్లో నాకు అలవాటయిపోయింది.

మాఇంటికి రెండు ఇళ్ళ తర్వాత పోరంకి వారి ఇల్లు ఉండేది అ అరుగుమీద ఒకతాతగారు నిత్యం 'రామ' జపం చేసేవారు. ఆయన తన చావు ముందే చెప్పి చనిపోయారుట— ఆ వార్త — ఆయన పరిచయం — నాలో గాఢ ముద్ర వేసుకుంది — నాలో విపరీతంగా రామ భక్తి పెరిగిపోయింది. జీవితంలో చాలా కాలం వరకు రాముడు దేముడుగా నాకు

ఆ రాధ దైవమయ్యాడు. రవివర్మ రామలక్ష్మణ సీత ఫోటోలు ఆరోజుల్లో చాలా ఉండేవి ఆఫోటోలు చూసి, చూసి నాకు అమితానందం కలిగేది పైతే ప్రతిసాయంత్రం గుడికి వెడుతూండేవాడిని. సుబ్బారాయుని గుడి, జనార్ధన స్వామి కోవెలకు అలమూరులో నేను అనేకసార్లు చిన్నతనములో వెళ్ళి దైవదర్శనము చేసుకునేవాడిని సుబ్బారాయుని గుడిప్రక్కనే నాగుల చెరువు, చెరువుగట్టుపైఅరుగులు ఉండేవి ఆ అరుగులపైసాయంత్రం పెద్దలు వాహ్యాళికి వచ్చికూర్చునేవారు. నేనుకూడా అక్కడ కూర్చునేవాడిని మా నాన్న మాతమ్ముడు ప్రకాశం, నేను కలిసి వీలైనప్పుడు అక్కడికి వెళ్ళేవాళ్ళం-జనార్ధనస్వామి గుడిచుట్టూ పెద్ద ప్రాంగణం తులసిచెట్లు అనేకం వుండేవి. గంటలు మ్రోగటం, ప్రాంగణంలోచల్లగాలి పూజారి మంత్రాలు, గన్నేరుచెట్లపై పిట్టల మెదలికవల్ల గలగలలు ఎంతో హాయిగావుండేది వాతావరణం. అయితే కాలవకు వెళ్ళేదారిలో ఒక గణేశుడిబొమ్మ ఒక మర్రిచెట్టుక్రింద వుండేది.

ఆబొమ్మకునేను చాలా కాలం పరీక్షలు ప్యాసయినపుడల్లా కొబ్బరికాయలు కొట్టేవాడిని. ఎప్పుడైన పర్వదినాల నాడు గోదావరి స్నానానికి కాలువ రోడ్డుద్వారా నడచి మేము వెళుతూండేవారం. మా అమ్మ మమ్మల్ని తెల్లవారుజామునే లేపి, ఇతర పొరుగు అమ్మలక్కల జతగూడి తీసుకొని పోయేది. అప్పుడప్పుడు మానాన్నకూడా మాతోవచ్చి,నట్లు జ్ఞాపకం. ఆ కంకర ఎర్రదుమ్ము రోడ్డుకిరుప్రక్కల చింత

మామిడి చెట్లు, కాలవలో తెరచాప పడవలు—ఆవలి గోదావరి ఒడ్డుమీద ఈత చెట్లు ఇసుకతిన్నెలు, గోదావరినదీతరంగాలు నాలో అపూర్వమైన కల్పనా భావనాశక్తులు నింపేయి.

## బ్రహ్మి - దాసి

మాయింటికి ఒక దాసీమనిషివుండేది. ఆమె పేరు బెమ్మి. బ్రహ్మి యిలా వాడకంలో మారిపోయిఉంటుంది. ఆ గ్రామములో దాసీమనుషులంతా నాగులచెరువుకు ఎదురుగా ఉన్న మర్రిచెట్టు క్రింద ఆపూరివారి అంట్లుతోముతూం వారు పదిపదేను ఇళ్లవారి అంట్లు ఒకేసారితీసుకుపోయి ఆమె తోమేది. అలాగే ఇతర దాసీ మనుషులు కూడా మాఅమ్మ గారికి స్నానం, మడి ఉండేవి వంట చేసేసమయంలో. ఆవిడ స్నానంచేసి వంటకు ఉపక్రమించినా దాసీ బెమ్మి అంట్లు తేనప్పుడు నేను నాగులచెరువువైపు పరిగెత్తేవాడిని అమ్మ వురమాయింపుతో. పొయ్యిరాజేసినా, పొయ్యిమీద గిన్నెలు తేకపోతే ఎలా—అని ఆమెబాధపడేది. మా అమ్మగారిది పెద్దచేయి. దాసీమనిషికి నిత్యం ఒకరిద్దరు భోజనంచేసే అన్నం ఇతర దినుసులు లభిస్తుండేవి ఆవిడ ద్వారా. పండగలు వచ్చాయి, వస్తే చెప్పనక్కరలేదు. దాసీ మనిషికి మామూలి వారికంటే పండగగా ఉండేది. సూరమ్మగారు అన్నపూర్ణమ్మగారిని పొగిడితే మా అమ్మకు యింకా పట్టపగ్గాలుండేవి కావు. పిల్లలైనంత భారీగా దానధర్మాలు చేసేవారావిడం నేను

తరచు నాగుల చెరువు వద్ద ఆ అంట్లుతోమే దాసీ వ్యక్తుల్ని చూస్తుంటే నాకేవేవో ఆలోచనలువస్తూ. డేవి. వారిదరిద్రం నీచవృత్తి, ఇవన్నీ విచిత్రముగా కనిపించేవి బెమ్మినోట్లో అగ్గి చుట్ట లోపలకు పెట్టుకొని కూడా కాల్చేది. ఇంటికి వచ్చిన పుడు ఆమెనోటి సువాసనలు విచిత్రముగా ఉండేవి .

మానాన్నకూడా లంకపుగాకు చుట్టలుదర్జాగా కాల్చే వారు. తీరుబడి సమయాలలో నూ ముఖ్యంగా బోజనానంతరం ఆయనచుట్టలు కాల్చేవాడు ఆయన తెచ్చికూట్లో పెట్టుకున్న చుట్టలు నేను దొంగతనముగా వాసనచూసేవాడిని ఆ వాసన నాకునచ్చేది కాని-బెమ్మినోటివాసనతో మాట్లాడుతుంటేనాకు దూరముగా ఉండాలనిపించేది. ఆ అంట్లుతోమే ప్రదేశం కూడా శుభ్రంగా వుండేదికాదు. గొప్పయింటివాళ్ళ యిళ్ళ ల్లోనుంచి కూడా అంట్లుతోమడం యిదే విధంగా జరిగేది. ఆ నాటినుంచే అంతదరిద్రంతో భాధ పడేవారి జీవితాలు ఎలా గడుస్తుంటాయో అనే విచిత్రభావనతత్వం నాలో మొదల పాగింది. తల్లిదండ్రుల పెంపకంలో దారిద్య్రంఅంటే తెలి యక పోయినా, జీవితంలోవ్యత్యాసాలు ఆ వ్యత్యాసం ఎలా వస్తుంది అనే పరిశోదనాపూర్వక ఆలోచనలునన్ను ఉక్కిరి బిక్కిరి చేసేవి.

4)

# దొడ్డి - చెట్లు

మా యింటికి ఒక పెద్ద కాంపౌండువుండేది. ఆ కాంపౌండు నిండా అనేక చెట్లు అరటి, దానిమ్మ, సీతాఫలాలు జామిచెట్లు, మల్లిపూలతీగలు, దబ్బ,నారింజా యింకాఅనేకం వీటన్నింటికీ చక్కగా పాదులు చేసి సాయంత్రం వేళల నీళ్ళు పోయడం నాకు సరదాగావుండేది. నాతో పాటుమాఅక్క బహుశా చిన్నతమ్ముడు ప్రకాశంకూడా యీ కార్యక్రమంలో వుండేవారు. దీనికి సారధ్యం మాఅమ్మ. దొడ్డిలో ఒక పైపువర్పాటుచేశారు. పైపుచుట్టూ సిమెంటుచప్టా.అక్కడ నీరుతోడే వారొకరు ఆనీరు చిన్నచిన్న పిల్లకాల్వలద్వారా చెట్లబోదల్లోకి వస్తూండేది ఆనీరు గల గలా పారుతూమెల్లగా బూమిని తడువుకుంటూ బోదల్లోకి ప్రవహిస్తూంటే ఎంతో సరదాగా ఉండెడిదినాకు. దొడ్లోకాసే అరటి పండ్లు, దానిమ్మపండ్లు, సీతాఫలాలు, జామిపండ్లు అప్పుడప్పుడు తింటూ ఉండేవారము. మా జామిచెట్టుకు పెద్దచరిత్రవుందనే వారు దానిపండ్లుచాలాపెద్దవిగా వుండేవట మేముఎదగనపుడు మాకు జ్ఞానం రానపుడు. జ్ఞానం వచ్చాకకూడ జామపండ్లమీదే నిత్యం నాకన్నుపడేది. రోజూ నేనూ మాఅక్క భాను జామ పండ్ల అన్వేషణలో కార్యక్రమం ప్రారంబించే వారము.

ఆమె ఎక్కి పండ్లు కోయాలి నేను క్రిందనుంచి అందుకోవాలి ఒక రోజు నేను ఇంట్లో లేను. కాని ఆ కార్యక్రమం మా అక్క జరిపింది. ఆ సమయంలో ఒక కోతి జామచెట్టుమీద ఎక్కి కూర్చుని, ఆమె కోసే పండుకోసం తగవుపడి, ఆమెను అల్లరి చేస్తే, మా అక్క బయపడి చెట్టుమీదనుంచి క్రిందకు జారిపడింది ఆపడటంలో ప్రక్కనే వున్న పచ్చడి రుబ్బురోలు, కటిక నేల మున్నగున్నవి ఆమెకు కొంచం గాయాలు కలిగించాయి ముఖ్యంగా ఆమె చేతి మధ్య వ్రేలు విరిగిందని తెలిసింది. ఆ వ్రేలు సాఫిచేయడానికి అనేక నాటువైద్యాలు, అన్నీ జరిగాయి. కాని ఆమె వ్రేలుమాత్రం వంకరగా మారిపోయింది ఆ సంఘటన నన్ను అదుపులో పెట్టింది. అనేక చోట్ల చెట్లు ఎక్కే పరిస్థితులు ఏర్పడినా చెట్లు ఎక్కడమంటే — ఎందుకులే పోని అని దూరంగా పోయేవాడిని.

## కలలు

నాకు రాత్రిళ్ళు బాగా కలలు వస్తూండేవి. మా దొడ్డిలో రాత్రి చీకటి పడితే నాకు భయంకరంగా చెట్లు కనిపించేవి. చెట్ల ఆకుల గల గలలు, కీచురాళ్ళ మోతలు నాకు మరో భయం కలిగించేవి. రాత్రి ఒంటరిగా గదివిడిచి దొడ్డి

లోకి రావడం భయంగా ఉండేది. ఎవరో ఒకరుతోడు లేనిదే కదలేవాడినిగాను దొంగల భయం చాలా విపరీతంగా వుండేది నాకు — కలలో అనేకసార్లు దొంగలు యింట్లోపడిన వ ఘటనలు కనిపించేవి. దొంగపడితే నోరు ఎండిపోయి కలలో ఏదో విపరీతంగా కేకవేసి మేల్కొనే వాడిని. ఒక్కొక్కసారి దొంగను తప్పించుకోవాలని, గబగబ పరుగెత్తి బాధపడుతూండే 'దేవా పరమేశ్వరా' అని ఆకాశంలోకి ఎగిరిపోయే వాడిని అలా ఎన్నిసార్లు కలలో ఎగిరిపోయానో చెప్పడం కష్టం. చిన్నతనంలో అనేక కథల్లో, దేవతలు అలా గాలిలో ఎగిరేవారని విన్నాను. అలా గాలిలో ఎగిరిపోవడం, నీటిమీద నడచిపోవడం—ఎంతో యిష్టంగా వుండేది. ముఖ్యంగా నాకు ఎంత ప్రయత్నం చేసిన పూర్తి ఈతరాలేదు. అందువల్ల నీటిలోంచి నడచిపోతే — అని కలలు గనేవాడిని.

రాత్రి వెన్నెల రోజుల్లో వేసవిలో ఆరుబయట పక్కలు వేసుకుని పడుకునేటప్పుడు కూడా ఎదురుగా [illegible] పాకటింటినుంచి దొంగలు నడచివస్తున్నట్లు భ్రమపడేవాడిని ఆ భయోత్పాదమే చాలా వరకు జీవితంలో నన్ను పిరికివాణ్ణి చేసిందనడంలో అతిశయోక్తి కనిపించదు. ఆ భయంపోవడానికి అనుభవాలు పెరిగిన కొద్దీ కొంత సాధన అనేక రంగాలలో చేయవలసి వచ్చింది. ఎవరితోనైనా ధైర్యంగా మాట్లాడటం కష్టమయ్యేది. ఎవరైనా తిడితే నోరు మూసుకు వచ్చేవాడిని. ఏ పనైనా స్వయంగా చేసుకురావడం చాలా కష్టంగా

వుండేది. ఒంటరిగా రాత్రి ఎక్కడికీ కదలలేక పోయేవాడిని. సాలిగూళ్ళలో బంధించినట్లు నన్ను నా జీవితంలో అనేక రకాల భయం ఆవరించినన్ను బ ధించేది. వ్యక్తిత్వం, జీవిత గమనం, పరిశీలన, విస్తృత ప్రయాణాలు, స్నేహప్రపంచం, ప్రజారంగం-పఠనాశక్తి కాలక్రమం లో నాలో నూతన చైతన్యంకలిగించి యీ అంతర్గత భయ లక్షణాలు తొలగించి, అనంత ధయిర్య సాహసాలు అందించాయి

## డాక్టరు చలపతి

### ఆయన వైద్యశీలులు

ఆలమూరులో నన్ను అమితంగా ఆకర్షించినవ్యక్తులలో డా॥ చలపతి ఒకరు ఆయనఆస్పత్రి బోంచెరువు దగ్గరగా ఉండేడిది ముందుపెదకాంపౌండ్-ఆకాంపౌండ్‌లో పెద్దపాక-ఆపాకకు ఆనుకుని కొన్నిగదులు-ఆయన అన్నిరకాలవైద్యం కూడా చేసేవారు పిచ్చివాళ్ళ వైద్యంలో ఆయన బహు నేర్పరి. నేను మందులకు ఆయనదగ్గరకు వెళ్ళినపుడల్లా ఆస్పత్రి కాంపౌండులో పిచ్చి వాళ్ళు చాలా కనిపిస్తూ ఉండేవారు. కొన్నాళ్ళు ఆయన ఆసుపత్రి బోంచెరువు దగ్గర నే ఒక మండువాలోగిలిలో వుండేడిది ఆ ఆస్పత్రిలో అనేక పాత్రలుఇప్పటికి నేను మర్చిపోనంతగా హృదయానికి హత్తుకు

పోయారు. డా॥చలపతి మా నాన్నగారికి చాలా మంచి మిత్రుడని ప్రతీతి.

నేను మందుల కోసం వెడితే డబ్బు ఏమీ ఇచ్చేవాడిని కాదు. మా నాన్న ఏమి ఇచ్చేవారో నాకు తెలియదు. సం[illegible]గా పేరుగ్గాంచినవ్యక్తి [illegible] బజారు [illegible] [illegible] హోంచుకు వెరుచుకుంటూ, [illegible] చాలా స్త్రీభావంతో నాతో వుండేవారు. అ[illegible] [illegible] వరు నరసింహామూర్తిగారు—[illegible] లావుగా [illegible]గా పెద్ద మనిషి తరహాగా వుంటూ చాలా కాలం [illegible] ప్రాక్టీసు చేశారు. అందరికన్నా యింకా విచిత్రమైన వ్యక్తి "సత్తెయ్య" నౌకరు. అతడు పిచ్చివాళ్ళను అదుపులో పెట్టడం సరదాగా వుండేది చూడడానికి. ఒకొక్కసారి పిచ్చివాళ్ళను సత్తెయ్య భోంచేరు వుకు తీసుకు వెడుతూండేవాడు — యీపిచ్చివాళ్ళ చేష్టలు నవ్వుకలిగించినా నాకు ఏవో విచిత్రమైనఆలోచనలు కలిగిస్తుండేవి. డా॥ చలపతి వద్ద నాబంగారు పళ్ళెంఏమైందో అనే పిచ్చిమనిషి నిజంగా బంగారంలావుండేవాడు. అన్నీ సవ్యంగా మాట్లాడుతూనే హఠాత్తుగా నా బంగారుపళ్ళెం ఏమైంది అనేవాడు అందరికి ఆశ్చర్యంగా—ఆమాటలేకపోతే ఆయనకు పిచ్చివాడుగానే కనబడడు అత్తగారికీ,తమతమ తలితండ్రుల బంగారుపళ్ళెం గురించి తగాదాలురాగా, భార్య పుట్టింటి నుంచి రానందున అయనకు మతిభ్రమించిందని విన్నాను. అదే దృష్టిలో పెట్టుకుని నేను "ఇదీతంతు" నాటికలో రాజ కీయవేత్త పిచ్చివాడిని సృష్టించాను. నా సాహిత్యంలో

మెదిలిన అనేక పిచ్చిపాత్రలు సృష్టికిమూలం డా॥ చలపతి ఆస్పత్రిలో నా పరిశీలన, అనుభవాలే. ఒక్కొక్కసారి పిచ్చివాళ్ళు గంతులు వేసి, గందరగోళం చేస్తుంటే. డా॥ చలపతి ఒక్క కేక పెట్టేవారు- అంతటితో అందరి పిచ్చివాళ్ళకు నోట బంద్. మా మేనమామ ఒకరు గండికోట రామమూర్తి మా కుటుంబానికి ఆప్తులుగా ఉండేవారు. ఆయన్ని డా॥ చలపతి ఆస్పత్రిలో నాలుగువారాలు చేర్పించవలసివచ్చింది. అయితే డా॥ చలపతికి, మా నాన్నకూ మా మామయ్యకూ చాలా సన్నిహిత మైత్రి. అటువంటి స్నేహంగల పిచ్చివాడు మిత్రుడు డాక్టర్తో పిచ్చిగా సంభాషిస్తున్నపుడు చాలా విచిత్ర అందమైన కావ్యంలా వుండేది నాకు. వారి ఛలోక్తులు విరుపులు, నవ్వులు- బలేహాస్యంగా వుండేవి. డా॥చలపతిది గ్రామీణ ఆస్పత్రి. దానికి ప్రభుత్వసహాయం కూడా ఉండేది నేను మాతల్లి అక్కచెల్లెళ్ళతో ఆవూరు వదలి వచ్చినా మానాన్న చనిపోయాక కూడ, డా॥ చలపతి నేను ఎప్పుడు ఆలమూరువెళ్ళినా చాలా ఆప్యాయతతో నన్ను చూసేవారు. ఒక్కొక్కసారి వారింట్లోనే భోజనం పడక, అన్నీ కూడా. డా॥ చలపతి కుమారుడు జనార్థంతో నాకు కొంచెం మైత్రి బాగా వుండేది-నాకన్నా అతను చిన్న అయినా, తండ్రితోపాటు వారి కుటుంబంకూడా మా కుటుంబానికి అనేక కష్టాలలో ఆదుకుని సానుభూతి అందించేవారు.

డా॥ చలపతి నిత్యజీవితం విచిత్రగా వుండేది. ఆయన సాధారణంగా ఎనిమిది గంటలకు ఆస్పత్రిలో రడీగా వుండే

వారు. అందరికీ మందులిచ్చి ఆయన మూడు గంటలకు భోం చేసి పడుకునే వారు.

సాయంత్రం ఆస్పత్రి చూసుకొని జట్కాలో చుట్టు ప్రక్కల గ్రామాలకు కూడా రాత్రి పర్యటించి రోగుల్ని చూసుకొని వచ్చి రాత్రి మూడు గంటలకు భోజనంచేసేవారని ప్రతీతి. ఆయన చిరునవ్వే సగం రోగం తగ్గించేది. నాకు జ్వరాలు, మాఅమ్మకు కళ్ళ కలక, నేను అప్పుడప్పుడు తగు ల్చుకొన్న గాయాలకు వైద్యం - ఇవన్నీ ఆయనే చిరు నవ్వుతో చూసేవారు. ఒకలుంగీ, పైన పొడుగాటి లాల్చీ, పెద్దబొజ్జ, ఫాలాన తిరుచూర్ణం పెట్టుకుని రోడ్డుమీద డా॥ చలపతి నడచి వస్తుంటే, ఏ రోగికైనా ఆత్మీయుడు వస్తున్నట్లనిపించేది.

డా॥ చలపతి ఒక్క వైద్యుడేకాదు. ఆ గ్రామ రాజ కీయాలలో చాలా గట్టిగా పునాదులు చేసుకొన్నవారు. ఆ ఛార్లో పేరున్న నరసింహ దేవరవారికి, డా॥ చలపతి ప్రభృ తులకు రాజకీయాలలో చుక్కెదురే. ఆ పరిస్థితులల్లో మా నాన్న నరసింహ దేవరవారి దగ్గర ఉద్యోగం చేస్తూ, డా॥చలపతిస్నేహితుడు కావడం వల్ల కొన్ని ఇరకాటాల్లో పడ్డాడని చూచాయగా నాకు తెలుసు. నరసింహ దేవర కామేశ్వర్రావుగారు మేము వున్న వీధిలోనే హోమియో పతి వైద్యం చేశేవారు. డా॥ చలపతికి డా॥ కామేశ్వ ర్రావు గారి వైద్యరీతులకు ఆ గ్రామంలో రాజకీయాలకు ముడి

పడిన సంబంధం వుందంటారు — అయితే చలపతి పూర్తి జీవితంగాని, ఆయన కుటుంబ వివరాలు కాని నాకు ఎక్కువ తెలియదు. మా అమ్మ, నాన్న ఏవైనా సంభాషించుకుంటూంటే తాత్కాలికంగా విన్నా, అవి ఎక్కువ గుర్తులేదు. డా॥ చలపతి పెద్దకొడుకు కూడా వైద్యంలో ప్రవేశించారు తండ్రి ఆస్పత్రిలోనే. అయితే ఆయన చాలాసాత్వికుడు, భయస్థుడు కావడం వల్లనేమో యీ వైద్యరంగంలో రాణించక తానే మతిభ్రమణ పరిస్థితి తెచ్చుకున్నారు.

డా॥ చలపతివంటి మానసత్వంగల వ్యక్తికి పెద్దకొడుకు అలా మారిపోవడం అందరికీ సానుభూతి కలిగించేది. అయినా ఎవరి జీవితాలు ఎలా వెళ్ళాలో ఎవరు చెప్పగలరు? బంధుత్వాలు, ప్రేమలు, కుటుంబ సాన్నిహిత్యాలు అన్నీ మిధ్య అనిపిస్తుంది. ఎవరి విధిననుసరించి వారిజీవితం గడుస్తుంది కాని తండ్రి ప్రతిభావంతుడైనంత మాత్రాన కుమారుడు కూడా అదే కోవకు చెందాలనుకోవడం మన భ్రమ. ఇది అనేక మంది జీవితాల్లో ఆ గ్రామంలోనే కాక, కాల క్రమంలో నేను చూసి, నేర్చుకున్న ప్రాథమిక జీవిత సూత్రం.

## కొత్తూరు స్కూలు

అక్షరభ్యాసం, తరువాత అక్షరాలు, ఎక్కాల చదువులు కాంతాం మాష్టారివద్ద పూర్తిచేశాక, నన్ను

కొత్తూరుస్కూల్లో చేర్పించారు. ఆలమూరుకు దాదాపు
మైలున్నర దూరం వుంటుందికొత్తూరుగ్రామం. ప్రొద్దున్నే
చద్దిభోజనంచేసి, టిఫిన్ కారీరులో సున్నం పెట్టుకొని
కొత్తూరు స్కూలుకు పోయేవాడిని, కొన్నాళ్ళు వీలైతే
ఒంటిగంటకు భోజనాల సమయంలో ఇంటికివచ్చి, ఉరకలు
పరుగుల మధ్య రెండుముద్దలుతిని, మళ్ళీస్కూలుకుపరిగెత్తుకు
పోయేవాడిని. కొత్తూరునుంచి ఆలమూరుదాకా ఎర్రరంగు
బూడిదతోకూడిన కంకరరోడ్డు, రెండువైపులా చింతచెట్లూ,
నేరేడుచెట్లూ వుండేవి. ఆ ఎండ నీడల్లో స్నేహితులతోనడిచి
వెళ్ళివస్తూంటే అదొక విచిత్రానుభూతి కలిగేది. టెలిఫోన్
తీగలమీద వాలే పాలపిట్టలతో ఆడుకుంటూ, స్నేహితులతో
కబుర్లు చెప్పుకుంటూ వచ్చేవాడిని కొత్తూరుస్కూలు కర్రకట
కటాలతో కొన్నిగదులుగా వుండేది.

ఆస్కూలుకు ఎదురుగా ఒకఫర్లాంగు కావతల
విశాలమైన మైదానం వుండేది. ఆ మైదానంలో నూయి
ఉండేది. ఆ మైదానంలో సాయంత్రం మాకు డ్రిల్లు చెబు
తూండేవారు. మధ్యాహ్నం టిఫిన్ కారీరులో భోజనం
ముగించుకొని ఆ మైదానం ప్రక్కనే పారే పిల్లకాలవలో
ఆ కారీర్లు కడుక్కుని, జాగ్రత్త పెట్టుకునేవాళ్ళం. ఒకసారి
నేను భోంచేసి టిఫిన్ కారీరు కడుక్కునే సమయంలో మా
నాన్న అదే రోడ్డుపై జట్కాలో వెళ్ళడం మా స్నేహితుడు
చూసినాకు చెప్పారు. నేను టిఫిన్ కారీరు అక్కడే వదిలిజట్కా
వెనుక పరుగెత్తుతూ మానాన్న జట్కా ఆపి అణా చేతిలో

పెట్టి ఏదైనా కొనుక్కోమని అన్నారు. చేతిలోని ఆ డబ్బు చూసి స్నేహితుల దృష్టి దానిపైనే ప్రసరించి, నోరూరడం నేను ఏదో కొనడం అందరూ తినడం జరిగింది. అదొక అనుభూతి తండ్రి కొడుక్కి డబ్బిస్తే, తక్కిన స్నేహితులదృష్టిలో అదొక పెద్దగౌరవం.

కొత్తూరు స్కూల్లో చదువుతున్న రోజుల్లో నేను చాలా కష్టపడి వెడుతుండేవాడినని మా అమ్మా నాన్నా అనుకునేవారు. చదువుకూడా అంతంత మాత్రంగానే వుండేది. నాకు లెక్కలు ఎప్పుడూ పూజ్యమే. చాలాసార్లు మా లెక్కల మాష్టారు నన్ను ఈత బెత్తాలతో కొట్టడం నాకు గుర్తే. బెంచీమీద నిలబెట్టి చేతులు జాపించి మరీకొట్టేవాడు. ఈతబెత్తం విరిగేదాకా కొట్టడం ఆయనకిష్టం. అది విరిగితే బెత్తం మళ్ళీ వాడేవాడుకాదు ఆయన. మా క్లాసులో ఒక మానీటరు ఉండేవాడు. అతని పేరు చక్కా సుబ్బారావు అని జ్ఞాపకం. అతను వైశ్యుడు. అతని నుదుటికి పంగనామాలు పెట్టుకునేవాడని ప్రతీతి. అతను చాలా తెలివైన వాడవటం వల్ల అతన్ని క్లాసు మానీటరు చేశారు. అతన్ని చూసి, కొంచెం భయంగా ఉండేది మాకు. మమ్మల్ని గురించి ఏమైనా ఫిర్యాదులు మాస్టర్లకు చేస్తే మాకు బాధలు అనంతంగా వుండేవి

అయితే చక్కా సుబ్బారావు కొంచెంలావుగా నల్లగా వుండేవాడు. ఎక్కడి నుంచైనా వగరుస్తూగబగబా క్లాసు రూములోకి అడుగు పెడితే ముచ్చెమటలు కార్చుకుంటూ

కూడా స్నానంచేసిన వ్యక్తిలా కనిపించేవాడు. అంత చిన్నతనంలో కొంచెంపెద్దశరీరం, కలిగివుండడం వల్ల మాకు ఒక విధమైనభయం, వైచిత్రికూడా కలుగుతూవుండేవి మా లెక్కల మాస్టారు పేరు పున్నయ్యగారు ఆయన ఎర్రగా జామిపండు రంగులో వుండేవాడు. చేతి బొటనవ్రేలు చూపుడువ్రేలుమధ్య కలంపట్టి వాడిగా వ్రాసేవారు వేడిగా మాసేవారు నుదుట ఎర్రటి కుంకుమబొట్టు అప్పుడప్పుడు గంధంపూత-పంచ, చొక్కా-పైనకోటు సన్నగావుండేవారు, ఆయన పట్టు. బిగబట్టితిడితే చేతిమీద ఈతబెత్తాల దెబ్బలు తప్పవన్నమాట.

ఆస్కూలు హెడ్మాస్టారు వుండేవారు. ఆయనను అందరూ ఒకచలోక్తిద్వారా జ్ఞాపకం చేసుకునేవారు. ఆయన పాఠాలు చెప్పేటప్పుడు. "బట్ అయితే కాని" అనే ఊతపదం వాడేవారు-అదే కలిపి తెలుగులో చదివితే విపరీతార్థ వచ్చేది ముఖ్యంగా అలా అంటూ విద్యార్థులవైపు ఆయన చూస్తుంటే పిల్లలులోలోన ముసిముసి నవ్వులతో గుసగుసలాడుకొనేవారు- కొత్తూరు స్కూలులో యింకా చాలా మంది మేష్టరులు ఉన్నా అందరి గుర్తునాకు లేదు. ఆస్కూలు బయట చింతచెట్ల నీడల్లో హాయిగా చల్లగాలి వీల్చుకుంటూంటే. సరదాగా వుండేది. ఒకక్లాసునుంచి మరొకక్లాసుకు ప్రమోషను వచ్చివెడుతూంటె ఏదో గర్వంగా ఠీవిగావుండేది. అదొక పెద్దపండుగదినంగా ఆనందించేవాడిని. ఒకటి రెండు సంవత్సరాలు మా తమ్ముడు ప్రకాశం కూడా అదే స్కూలులో చదువుకున్నాడు. వాడు, నేనూ ఆలమూరు

నుంచి కొత్తూరు రోడ్డుమీద వసుగర్తి స్కూలుకి వెళ్ళి వస్తూండే వాళ్ళం. మా తమ్ముడు పొట్టిగా ఉండ్రముక్కలా దొర్లిపోతున్నట్లు నడుస్తుండేవాడు. వాడిని చిటికిన వేలుకు పట్టించి నడిపించడం ఇతర స్నేహితులతో మాట్లాడుతూ గబగబ ఇంటికి చేరడం ఒక సరదాగావుండేది. నాకొక ముస్లిం స్నేహితుడు ఉండేవాడు ఆలమూరులో పెద్దింటి వారింటి వీధిచివరలో అతను నివసించేవాడు. అప్పుడప్పుడు అతని సైకిలుమీద నేనూ పైకెత్తే మా తమ్ముడు కూడా ఎక్కిపోయేవాళ్ళం. ఆ ముస్లిం స్నేహితుడు మంచి తెల్లని పాప్లిన్ దుస్తుల్లో అత్తరు సెంటు వాసనలతో ఘుమఘుమలాడుతూ జోరుగావుండేవాడు. వయసులో నాకంటే పెద్ద అతనెక్కడున్నాడో ఇప్పుడు నాకు తెలియదు గాని. అతను మైత్రి చాలా గాఢంగా వాంఛించేవాడని. వారింట్లో వారు కూడా నన్ను గౌరవంగా పిలిచి స్వాగతమిచ్చేవారు.

## బాల్య స్నేహాలు

అయితే నేను పుట్టిన గ్రామం ఆలమూరులో నాకు కొన్ని మరచిపోలేని బాల్యస్నేహితులు వున్నారు. వారిలో కొందరు ప్రస్తుతం ఎక్కడ వున్నారో తెలియదు అయితే జ్ఞాపకాలు మాత్రం మరచిపోవడం కష్టం నేను చిన్న క్లాసులో చదువుకునే రోజులలో తాతబ్బాయి అనే ఒక స్నేహితుడు వుండేవాడు- అతను పోలీసు కానిస్టేబుల్ కొడుకు - అప్పుడప్పుడు

వారింటికి కూడా వెడుతుండేవాడిని. కాలవకు వెళ్ళేదారిలో తహసీల్దారు ఆఫీసు ప్రక్కన వున్న పోలీసు క్వార్టర్సు వరుసగా పొడుగ్గా రోకలి బండల్లా వుండేవి ఆ క్వార్టర్సులో ఒకచోట మాట్లాడే మైనాపక్షి కనిపించేది నాకు. అక్కడకు ఎప్పుడు వెళ్ళినా ఆ పక్షి మాట్లాడటం వినివచ్చేవాడిని. వారింట్లోనే రామచిలుకలు కూడా పంజరంలో ఉండేవి. రామ చిలుక అంటే నాకు చాలాయిష్టం- మాదొడ్లో జామిచెట్టు పైన రామచిలుకలు విరివిగా వచ్చి వాలి, జామపండ్లు తినేవి. ఆ చిలక కొట్టు జామిపండ్లు క్రిందపడినప్పుడు ఏరుకుని చాలా రుచిగా వుండేవని తినేవాళ్ళ — మా చిన్ననాటి స్నేహితుడు తాతబ్బాయి చాలా పొడుగ్గా ఉండేవాడు. అప్పటికే వాడి వయస్సు చాలా పెద్ద- అయినా నాతోటే, చదువు తూండేవాడు. ఒకరోజు తాతబ్బాయి, నేను, ఇంకా కొందరు బాల్యమిత్రులం కలసి సెలవు రోజున జనార్ధనస్వామి కోవెల లోని ముందు ప్రాంగణంలో కూర్చున్నాము. అది రెండు గంటలకాలం మూలాన పూజారులు, భక్తులు అలికిడి లేదు. తాతబ్బాయి చుట్టలు కాల్చగలడు. ఒక చుట్టతీసి ముట్టించాడు— కోవెలలో కాల్చకూడదని తెలిపినా వినకుండా చుట్ట కాల్చడం మొదలు పెట్టాడు. పైగా నన్ను కూడా నిర్బంధంచేశాడు. మొదటలో నేను వద్దన్నాను కాని, మా నాన్న కాల్చే లంకపొగాకు చుట్టలు చాలా పరిమళంతో వుండేవి- ఆ పరిమళం నాకునచ్చేది అందువల్ల పోనీ ఎలా

వుంటుందో కాల్చిచూద్దాం అనుకున్నాను. తాతబ్బాయి ననుసరించి నేను చుట్ట కాల్చాను. ఒక్క దమ్ములాగగానే కళ్ళుతిరిగాయి— ఈలోగా మానాన్న ఎక్కడినుంచి వచ్చారో హఠాత్తుగా కోవెలలోకి వచ్చేరు. విసుచుకు పడ్డారు మానాన్నగారిని చూసి మమ్మల్ని చుట్టకాల్చడం చూసి తుఫానులా తక్కిన స్నేహితులు పారిపోయ్యారు కాని నేను మానాన్న చేతుల్లో చిక్కాను. ఆరోజు నాఒళ్ళు ధ్వంసమయినంతగా ఆయన నన్ను చావగొట్టడం— దృశ్యం మరవురానిది. ఆనాటినుంచి ఈనాటి వరకు నాకు చుట్టలు కాల్చాలనే ధ్యాసలేకుండా పోయింది. కాల్చినా చుట్టపొగ నాకు పడదనికూడా అర్థమయిపోయింది. కొంతకాలం తాతబ్బాయి స్నేహాంపై ఆంక్షు విధించారు మాతల్లిదండ్రులు— తర్వాత తాతబ్బాయి నేను కొద్దికాలం కలుసుకున్నాం కాని, మరికొన్నాళ్ళకు అతని తండ్రికి బదిలీ అవడంవల్ల మా స్నేహాం ఎక్కడో ఆగిపోయింది—

మా యింటికెదురుగా గురవయ్యగారి అబ్బాయి పాపారావుతో చాలాకాలం నాకు స్నేహాం పెరిగింది తరుచు సెలవు దినాల్లో వారింట్లోకి పోయి పేకాట ఆడుకునేవారం. సెలవుల్లో పేకాటలోపడితే అసలు కాలం ఎలాదొర్లుతుందో కూడా తెలిసేది కాదు. గురవయ్యగారు, వారి భార్య, మా తల్లిదండ్రులుకూడా స్నేహాంగావుండేవారు. అప్పుడప్పుడు గురవయ్యగారిభార్య నన్నుకూడా వారింట్లో భోజనం చేయమని అడిగేవారుకూడా. గురవయ్యగారి సైకిలు పాపా

రావు వాడుతుండేవారు. వాడు సైకిలు తొక్కినట్టెలా నేను సైకిలు నేర్చుకొని త్రొక్కాలనిపించేది చివరికి సైకిలు త్రొక్కడం నేర్చుకున్నాను. ఒకరోజు పుట్టినరోజుకు పాపారావుకు వాళ్ళ తల్లిదండ్రులు క్రొత్త కాకి నిక్కరు, చొక్కా కుట్టించారు, అది విస్త్రీ చేయించుకొని పాపారావు ఠీవిగా వాడుతుంటే నాకు కూడా అలాంటి డ్రస్సు కావాలనిపించింది. మా నాన్న అమ్మను అడ్రస్సుకోసం వేదించినట్లు జ్ఞాపకం-చివరకు నాకూ, మా తమ్ముడికీ మానాన్నగారు మరో పండగకు ఆ కాకీలాగు చొక్కా కుట్టించిపెట్టారు. ఆరోజు ఆనందం. విజయగర్వం ఇంతా అంతా కాదు-పాపారావు నేనూ అప్పుడప్పుడు కొట్లాడుకొని జట్టు పోగొట్టుకొనేవాళ్ళం, అయినా చివరికి ఎవరో ఒకరు ముందు మాట్లాడుకొని స్నేహం కలుపుకునే వాళ్ళం. పాపారావు ఇంట్లో అతని అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు కూడా ఎక్కువే. ముఖ్యంగా అతని బావమరిది ఆరోజుల్లో బి.ఏ. ఆనర్సు చదువుతూండేవారు, ఆయన చాలా తెలివైనవారని అందరూ అనుకుంటూండేవారు—అంత తెలివిగా బి.ఏ. ఆనర్సు నేనూ చదువుకోవాలని లోలోపల అనిపించేనాదికి. గవరయ్యగారింట్లో అక్కచెల్లెళ్ళు అందరూ కూడా నన్ను అభిమానంగా చూసేవారు. తరువాత నేను పెద్దయ్యాక ఆ గ్రామము వెళ్ళినపుడు పాపారావు మాష్టరీ ఉద్యోగం చేస్తున్నాడని విన్నాను.

పాపారావు ఇంటిప్రక్కనే భైరివందు, సూరివందు అను ఇద్దరు అన్నదమ్ములుండేవారు. అయితే అవి పూర్తి పేర్లు కావు

కాని మేము అలా పిలిచేవాళ్ళం. చిన్నతనంలో తరచు నేను వాళ్ళింటికికూడా వెడుతుండేవాడిని– అక్కడ ఆడుకునే వాళ్ళం మేమంతా– వారి ఇంటి వెనకాల నుంచి పురాణపండ వారింటికి వెళ్ళడానికి దారివుండేది. ఒక్కొక్కసారి పురాణపండవారి పిల్లలతో ఆడుకోవడానికి ఆ ఇంటి దోవనే పోయేవాళ్ళం. పాపారావు, భైరి, సూరి, అన్నదమ్ముల బిడ్డలు. ఒక్కొక్కసారి భైరిపండు ఇంట్లో భజనలకు నేను హాజరయ్యేవాడిని— చెడుగుడు, గోటికాయలు, మొదలైన ఆటల్లో వాళ్ళు నాతో చేరేవారు. ఆ ఇంటికి ఎదురుగా పోరంకివారి ఇల్లు వుండేది. ఆ ఇంట్లో పేరిందేవి, బాలుడుతో పరిచయాలున్నా, ఏమంత స్నేహం వుండేది కాదు. కాని మా నాన్నగారు పోరంకి సత్యనారాయణ గారు స్నేహితులని చెప్పేవారు. తోసినప్పుడు పనిలేనప్పుడు, పోరంకివారి అరుగులమీద పడుకునేవాణ్ణి. ముఖ్యంగా వేసవి కాలంలో ఆ గచ్చు అరుగులు చల్లగా వుండేవి, ఆ ఇంటి ఎదురుగా పెద్ద చింతచెట్లు ఆ యింటికి చల్లదనం యిచ్చేవి. పోరంకివారి యిల్లు దాటాక ఒక మేడవుండేది. ఆ మేడలో వేల్చూరివారు ఒకాయన మేజిస్ట్రేటు వుండేవారు. ఆయన కుమారుడు సోమయాజులు. ఆ మేజిస్ట్రేటుగారు ఉద్యోగ రీత్యా ఆ ప్రాంతానికి వచ్చినవారే. కాని నాకు, వారి

అబ్బాయి సోమయాజులుకు చాలా స్నేహం కలిసింది. సోమయాజులు అన్నకొడుకు నారాయణకూడా ఆ గ్రామంలోనే వారితో వుండేవాడు. అతనితోకూడా చాలా స్నేహం కలిసింది. తరచు సైకిలుమీద ఊళ్ళో తిరగడం ఆడుకోవడంతో వాళ్ళ స్నేహం నేను చాలా వాంఛించేవాడిని ఆ వీధి ప్రక్కనే పెద్దింటి వారిఇల్లు వుండేది. అందులో వారి అబ్బాయి నారాయణకు నాకూ చాలా స్నేహం వుండేది. పెద్దింటి నారాయణ ఇప్పుడు నృత్యాలు చేస్తున్నట్లు తెలిసింది, ఆ చివరకు పోగా కరణం పోలాప్రెగడ జనార్ధనంగారి ఇల్లు వుండేది. తరుచు వారి అబ్బాయి కామేశ్వరరావు నేను ఎక్కువగా కలిసితిరిగి చదువుకునే వాళ్ళం. కరణం జనార్ధనంగారు, మా నాన్నకూడా బాగా స్నేహితులు. అయితే కామేశ్వర్రావు చాలా చిన్నతనంలోనే చనిపోయాడు. కామేశ్వర్రావుతో వున్న స్నేహబంధంవల్ల అతని చావు విన్నప్పుడు నేను చాలా బాధపడ్డాను. ఆ వూరువిడిచి వెళ్ళిపోయాకకూడా కరణం జనార్ధనంగారి ఇంటికి వెళ్ళి ఆయన్ను కామేశ్వర్రావు తమ్ముణ్ణి కలిసి వచ్చేవాడిని. జనార్ధనంగారింట్లో భోజనాలు చేసేంత చనువుకూడా కలిగింది నాకు.

మా యింటి కెదురుగా ఒకరి ఇల్లువుండేది. ఆ ఇంటివారు మాకు కుటుంబ శత్రువులని అనేవారు. మమ్మల్ని ఎవ్వరినీ ఆ ఇంటికి పోనిచ్చేవారు కాదు మా తల్లిదండ్రులు. అలాగే వారింట్లో ఎవ్వరూకూడా మా ఇంటికి వచ్చేవారు

కాదు ఎందుకు ఇంత బద్ధధైర్యం వైరం ఏర్పడిందో ఇప్పుటికీ నాకు అర్ధంకా లేదు ఏదో విషయంపై ఇరుకుటుంబాలు చాలా ఘర్షణపడ్డాయని విన్నాను. ఏ విషయంపై ఘర్షణపడినా జీవితాంతం బద్ధశత్రువుల్లా వుండడమనేది నాకు నచ్చేదికాదు. అసలు నిజజీవితంలోకూడా అంతే వుండాలనిపిస్తుంది. వ్యక్తులకు అభిప్రాయబేధాలు వుండడం సహజం వ్యక్తుల జీవితాల్లో సంఘర్షణలు రావడంకూడా సహజమే. అయినా ఒకరి నొకరు దూషించుకుని కొంపలు మునిగేంత బద్ధవైరం పెంచుకోవడం జీవితానికి హానికరమని నా అభిప్రాయం, తాత్కాలిక ఘర్షణల్లో ఉద్రేకాలు పెరిగి కొంత సౌమ్యత తగ్గినా కాలప్రవాహంలో హృదయాంతర్గత సుగుణాలు వెల్లుబికి రావాలి, అప్పుడేజీవితానికి సుఖము, శాంతి లభిస్తాయని నా విశ్వాసం.

ఆయితే నాకు ఇప్పటికీ జ్ఞాపకం. మానాన్న చనిపోయినప్పుడు వచ్చిన బంధువులు నేనుకూడా మొదటిసారిగా ఆబద్ధవైరులవారి ఇంటి అరుగుమీద కూర్చున్నాం. అప్పటికీ మనస్సులో ఇరవురకూ పశ్చాత్తాపాలు కలిగివుండవచ్చు. బహుశా వారుకూడా మానాన్న పోయినవుడు వచ్చి చూసి మనస్సులో మార్పుపొంది వుండవచ్చు. కాని తర్వాత నేను ఆ ఆలమూరు గ్రామం విడిచి పోవడంవల్ల నాకు వారితో ఏవిధమైన స్నేహం పెంచుకోడానికి వీలు లేకపోయింది.

అయితే ఆ చిన్నతనంలోనే చాలా సన్నిహితంగా కలిసిపోయిన మిత్రుడొకడు నాకున్నాడు. అతని పేరు పేరి శాస్త్రి కాని నేను తక్కిన వారందరూకూడా అతన్ని రంగయ్య అని పిలిచేవారు శ్రీ నరసింహ దేవర కామేశ్వ ర్రావుగారి కుమారుడతను. వారికుటుంబం సంయుక్త కుటుంబం. రాజకీయాల్లో ముఖ్యంగా సహకారరంగంలో ఎనలేని కృషి చేసిన నరసింహదేవర సత్యనారాయణ, కామేశ్వ ర్రావు అన్నదమ్ములు. మా నాన్న నరసింహ దేవర సత్య నారాయణ బ్యాంకులో పనిచేసేవారు. చాలాకాలం వారి ద్దరికీకూడా చాలా మైత్రి. వర ఆదరణ సహాయం పొందు తుండేవారు. కాని మానాన్నకు నరసింహ దేవర సత్య నారాయణకు ఎన్నికల సందర్భంలోవిభేధాభిప్రాయాలు వచ్చాయని చాటినట్టున మానాన్నకు నరసింహదేవర సత్య నారాయణకు విభేధాలు ఏర్పడ్డాయని వినికిడి ఏదిఏమైనా నేనూ రంగయ్య మాత్రం చాలా స్నేహంగా వుండేవారం. తరుచు నేను వారింటికి వెళ్ళడం, వారింట్లో కేర్రమ్స్ ఆడు కోవడం జరుగుతుండేది. వారి కుటుంబంలో అందరూ గౌర వించేవారు వారి అరుగుమీద కేరమ్స్ బోర్డుపెట్టి [redacted] కుంటుంటే రంగయ్యతో పాటు వారికుటుంబ సభ్యులు కూడా ఆ ఆటలోకలిసేవారు కామేశ్వరావుగారు మిత భాషి. హోమియోపతి వైద్యంచేసేవారు ఆయనచూస్తే కొంచం భయం భయంగా దూరంగావుండేవాడిని కాని రంగయ్యతల్లి గారితో నాకు ఎక్కువ చనువు వుండేది. వారింటికి వెళ్ళి నప్పుడల్లా నన్ను కూడా సమానంగా ఆదరించి, పిలున్న

వుడు భోజనం కూడా పెట్టి, అప్పుడప్పుడు టిఫిన్లు పెట్టి ఆవిడ నన్ను ఆదరించేది. ఒక విధంగా ఆ కుటుంబంతో చాలా సన్నిహిత్యం నాకు చిన్నతనంలోనే ఏర్పడింది.

వారిల్లు-గచ్చుయిల్లు ముందువాలోగిలి-పెద్ద కాంపౌండు ఎత్తైన పహారీగోడలు-గోడల కావతల దొడ్డి దాటగా నాగుల చెరువు ఆ బంగ్లావాతావరణం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నేనున్నది. ఒక పెంకుటిల్లు—వారిది పెంకుటిల్లైనా చాలా పెద్దదిగా వుండేది. ఆ యింటికెదురుగా కూడా ఒక కచేరి ఆఫీసు వుండేది. నేను ఎక్కడికి వెళ్ళినా మా నాన్నగారి పేరుమీద నాకు ఆదరణ గౌరవం లభించేవి. రంగయ్య తమ్ముడు; శాస్త్రి చాలా కుర్రవాడు వుండేవాడు అప్పటికి ఇప్పుడు పేరుపొందిన డాక్టరుగా కాకినాడలో వున్నారాయన. రంగయ్య క్రమక్రమంగా రాజకీయవేత్త లక్షణాలు పుణికి పుచ్చుకొని వ్యాపారరంగంలో వున్నట్లు ప్రస్తుతం తెలుస్తోంది.

అలమూరు గ్రామ వాతావరణం చిన్ననాటి మధుర స్మృతులలో నన్ను యిప్పటికీ ముగ్ధుణ్ని చేస్తుంది. కాలక్రమంలో కొన్ని మరచిపోతున్నా, ఆనాడు నాటుకున్న భావాలు, పెంచుకొన్న స్నేహాలు, ఆదరించిన మనుష్యులు అప్పుడప్పుడు మనస్సుకే స్క్రీనుమీద సినిమాలా తిరుగుతుంటాయి బహుశా జీవనతరంగాలలో ఆనాటి స్మృతి తరంగాలకు ఎందుకంత సౌందర్యం మనస్సులో హత్తుకుపోతుందో తెలియదు ఆ స్మృతికి స్మృతి తేదనిపిస్తుంది.

# బంధుత్వాలు

ఆ గ్రామంలో మాకు బంధువులు కొందరున్నారు. పోతుకూచివంశం జ్ఞాతులు అందరూ మాకు బంధువులే అని చెబుతారు. మా యింటి ప్రక్క సందులోనే పోతుకూచి రామస్వామి వుండేవారు. ఆయన్ని నేను అన్నయ్యా అని, ఆయన భార్యను దొడ్డమ్మా అని పిలిచేవాడిని. యీ బాంధవ్య పిలుపు ఎలా వాడుకలోకి వచ్చిందో నాకు తెలియదు. నాతో పాటు మా అక్క, చెల్లెలు, తమ్ముడు కూడా రామస్వామిని ఆయన భార్యను కూడా ఇలాగే పిలిచేవారు. పోతుకూచి రామస్వామికి అందరూ ఆడపిల్లలే. అందువల్లనో, ఎందువల్లనో, మగపిల్లలంటే ఆయనకు చాలా అభిమానం. నేను కనిపిస్తే 'శివయ్యా' అంటూ నన్ను ముద్దుచేసేవారు రామస్వామి భార్య మాణిక్యం దొడ్డమ్మతో నాకు చాలా సాన్నిహిత్యం చనువు వుండేది. తరచు వాళ్ళింట్లోకిపోవడం, భోజనాలు చేయడంకూడా కద్దు రామస్వామిగారి కూతురు 'చంటి'తో నేను ఎక్కువ ఆడుకునేవాడిని చిన్నప్పుడు ఆయన కూతురు రత్తప్పతో మా అక్కకు ఏబావ స్నేహంవున్నా నేను కూడా ఆమె స్నేహితులతో కలిసే ఆడుకునేవాడిని. మా యింటికి రామస్వామిగారిఇంటికి మధ్య ఒక కాంపౌండు ఉండేది. అది నిర్జన అరణ్యంగా తుప్పలు అన్నీ పెరిగి పోయి రాత్రి భయంకరంగా వుండేది. ఆ ప్రాంతంనుండి

పాములు ప్రసరించటం నాకు జ్ఞాపకం. పాములు చంపడంలో మా నాన్నగారు చాలా ధైర్యస్థుడని చెప్పేవారు. త్రాచును అవసరమైతే తోక పుచ్చుకుని నేలకేసి కొట్టి చంపేవారు ఆయన అదృశ్యం చూస్తుంటే నాకే భయంవేసేది రాత్రి కలల్లో పాములు కనిపించడం దడుసుకోడం చిన్నతనంలో నాకు జరిగేది అయినా ఇప్పుడు కూడా ఆ Sub conscious అలోచనల మూలంవల్ల అనుకుంటూ, పాములు యింకా కలల్లో కనిపిస్తూనే వుంటాయి ఒక్కొక్కసారి పెద్దపెద్ద పాములు మాగి కలలో సఘటనలకు భయపడడం ఇప్పటికీ జరుగుతుంది నాకు.

మా అమ్మ, మాణిక్యం దొడ్డకూడా చాలా దగ్గర స్నేహితుల్లాగ వుండేవారు భోజనాలనంతరం మధ్యాహ్నం తీరుబడిగా మా యింటి వరండాలో చాపమీద కూర్చుని మాణిక్యం దొడ్డమ్మ మా అమ్మ, మా మామ్మ, మా రైమ్మ కబుర్లు చెప్పుకోడం మామూలే.

ఆ కబుర్లలో ఆ గ్రామ వాతావరణం వ్యవహారాలు ఊళ్ళో అమ్మలక్కల వడ్డాణాలు నగలు ఇంటింటా వంటలు వార్పులు, పిల్లల చదువులు అనారోగ్యాలు ఎన్నో విషయాలు దొర్లిపోతుండేవి.

మాణిక్యం దొడ్డకు కూడా మగపిల్లలంటే ప్రీతి కావడంవల్ల, నన్ను మా తమ్ముణ్ని కూడా చాలా అభిమానంగా చూసుకునేది. మా ఇంటికి రామస్వామిఇంటికి

వున్న సందులో మేము గోళీకాయలు, చెడుగుడు, తుమ్మెంద దాగుడుమూతలు యింకా ఎన్నో ఆటలు ఆడుకునేవారం.

చిన్నతనంలో అనేక బంధువులు మా యింటికి వస్తుండేవారు అందులో ముఖ్యంగా గవరమ్మగారు. ఆవిడ కుటుంబం కూడా మా యింటికి సమానాంతరంగా వున్న మరో వీధిలో గవరమ్మగారి పాతయిల్లు వుండేది. గవరమ్మగారు మా అమ్మమ్మ చెల్లెలు, బ్రహ్మ చెముడు కాని మంచిమనసు మా కుటుంబానికి అన్ని కష్టసుఖాలలో చేదోడు వాదోడుగా వుండేదావిడ. ఆలమూరు గ్రామానికి దాపులో వున్న గోదావరి దాటితే కోమట్రాజులంక అనే గ్రామం వుండేది. ఆ గ్రామంలో మా నాన్నగారి అక్కగారి కుటుంబం వుండే వారు. వారు తరచు గోదావరి దాటి మా యింటికి వస్తుండే వారు. నేనొకసారి కొమట్రాజులంక కూడా వెళ్ళాను వారి ఇల్లు మట్టి అరుగుల ఎత్తు ఇల్లు ఆ అరుగులమీద జనం వచ్చి కూర్చుని కాలక్షేపం చేస్తుండేవారు మా మావయ్య గారితో- చిన్నప్పుడు ఆ గ్రామములో తిరుగుతూంటే ఎదో విదేశాలకు వెళ్ళినట్లే అనిపించింది. గోదావరి దాటి మేము సకుటుంబంగా ఆ వూరు వెళ్ళేవాళ్ళం గోదావరి నీళ్ళులేని కాలంలో పాయలు లోతులేనికాలంలో - అది దాటి కాళ్ళపైకి పంట్లాములు ముడుచుకుంటూ మా నాన్న చేయి పుచ్చుకుని నడుస్తూంటే - ఆ గోదావరి దృశ్యాలు ఏవో కొత్త పులకింతలు, ఆలోచనలు నాలో రేపుతుండేవి.

ఇది కాక మా బంధువులు కాకినాడలో కూడా వుండే వారు. తరచు మా నాన్న కాకినాడ, రాజమండ్రి వెళ్ళి వస్తూండడం, వచ్చేటప్పుడు వచ్చి వచ్చేటి బత్తాయిలు నల్ల ద్రాక్ష పండ్లు తెచ్చి మాకు పెడుతూండడం జ్ఞాపకం మా అమ్మ తాలూకు అక్కలు కాకినాడలో వుండేవారు ముఖ్యంగా మా రామన్న దొడ్డ. ఆదిలక్ష్మి దొడ్డ ఎక్కువగా మా యింటికి తరచు రావడం నాకు బాగా జ్ఞాపకం మా అమ్మకు పురిటి సమయంలో ఎవరో ఒకరు వచ్చి పురుడుపోసి సాయం చేసేవారు.

మా నాన్న గారివి, అమ్మగారివి చాలా భారీ చేతులని ప్రసిద్ధి బంధువులు ఎవరు వచ్చినా వారిని సత్కరించటమే కాక. బట్టలు పెట్టి పంపడం సంప్రదాయం వుండేదట.

మా నాన్నగారికి చెల్లెలు ఒకామె వుండేవారు. ఆవిడ పేరు సత్తెమ్మ మేము సత్తెపుత్తయ్య అని అనేవారం ఆవిడ ఆమె కొడుకు రమణమూర్తి కూడా మా అక్క పెళ్ళికి ముందు తరచూ మా యింటికి రావడం తెలుసు అలాగే సత్యమ్మగారి సుబ్రహ్మణ్య గారు మా నాన్న గారి అన్న రామమూర్తి శాస్త్రి కూడా మా యింటికి వచ్చేవారు.

సూర్యనారాయణమూర్తి మా అమ్మగారి అన్నలు వారితో కూడా నాకు చిన్నతనంలోనే పరిచయం ఏర్పడింది. చుట్టూవున్న బంధుత్వాలు ఇంతవరకే ఆనాడు పరిచయమైనా

ఆ బాదువులే నా విద్యార్థి దశ పూర్తి అయ్యేదాకా నా జీతంలో బలవంతరమైన అనేక భావాలు ప్రభవితంచేశారు. ఆలమూరు విడిచి పెట్టాక ఇ కాలఅనేక మంది బంధువులతో పరిచయమైయింది. బంధువుల జీవితాలు వారి అలోచనలు, నడతలు పరిశీలించిన నాకు, జీవితంలో ఎన్నో అనుభవాలు మానసికంగా పొంది జీవితంలో క్రొత్త పాఠాలు నేర్చుకున్నాను.

## చెవి లోలాకు

ఒకరోజు నేను నాగుల చెరువు ప్రాంతంనుంచి ఒంటరిగా వస్తున్నాను ఉదయం పది గంటలు కావచ్చును. నాగుల చెరువు ఒడ్డుమీదనే పెద్ద రావి చెట్టు వుండేది. ఆలమూరులో రావిచెట్టు గాలికి రివ్వ్యమని ఊగుతూ నృత్యంచేస్తుంటే హాయిగా వుండేది. ఆ ప్రాంతంనుంచి నేను ఇంటికి నడిచివస్తుంటే పోరంకి వారి అమ్మాయి పేరిందేవి ఆ రావిచెట్టు ప్రక్కన రోడ్డు గట్టు ప్రాంతంలో ఏదో వెతుక్కుంటోంది. నేను ఆసక్తితో ఏమిటీ వెతుకుతున్నావు అని అడిగాను. చెవి లోలాకు పోయింది నీకు ఎక్కడైనా కనిపించిందా అని అడిగింది ఆమె నాకు కోపంవచ్చింది అసలు నేనునీతో కలసి ఎక్కడికి వెళ్ళలేదు-నువ్వు ఎక్కడ తిరిగావో ఎక్కడ పారేసుకున్నావో-

అన్నాను పేరిందేవి ఏదో విచారంగా యింకా వెతుకుతూ అటూ ఇటూ తిరుగుతోంది. నేను చోద్యంగానిలబడివున్నాను చెవి లోలాకు కనిపించకపోతే వాళ్ళమ్మ పేరిందేవిని కొట్ట వచ్చు, నాకేదో విచిత్రమైన జాలి వేసింది. నిజంగా లోలాకు కనిపిస్తే బాగుంటుందనిపించింది. పేరిందేవి అలామూరంగా వెళ్ళగానే—గట్టిగా పిలిచాను-ఇలారా—అని- ఆమె పరుగెత్తు కుంటూ వచ్చింది- చెవిలోలాకు కనిపించిందా—అంటూ నేను అను కోకుండా ఏదో ఆవేశంతో చూడు—అదిగో ఆ రాళ్ళ మధ్య వుంది—అన్నాను. అలా అనడం ఆబద్ధం అని నేను ఒక వైపు అనుకుంటూనే వున్నాను కాని పేరిందేవి ఆశతో ఆ రాళ్ళ మధ్య వెతికింది. నాకే ఆశ్చర్యం వేసింది నిజంగా చెవి లోలాకు కనపించింది. నాకే ఆశ్చర్యంవేసింది.నామాటఎలా నిజమైందని. ఆరోజు చుట్టుప్రక్కలవారుఅందరూనన్నుఎంతో మెచ్చుకున్నారు —నేను లోపలికిదాచిన స్థలం ఎలాచెప్ప గలిగానని—కాని ఎవరు నాచాతో నేనుచెపలేదు. చెప్పడం సాహసమే కూడా అయినా యీ సత్య ప్రవచన శక్తికి నేనే నాలో తల్చుకున్నప్పుడు ఆశ్చర్యపోతాను.

## చెరువులో బోటు

అలమూరులో నాగులచెరువు ఊరికి మధ్యగా ఉంది. ఆ చెరువులో ఈత లాడేవారిని చూసి నేను ఈత కొట్టాలని

ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలుణ్ణయ్యాను. చివరకు కొద్ది
గా ముసుగు ఈతనేర్చుకున్నాను. అయితే చెరువు నీళ్ళమీద
తేలుతూ ఈతంగాడే వాళ్ళను చూస్తే నాకు అసూయకలిగేది.
ఏదైనా దైవశక్తి సంపాదించి వారికి పోటీగా నీళ్ళమీద నడచి
పోవాలని పించేది

ఒకరోజు నేను, రంగయ్యా, ఇతర మిత్రులు చెరువు
గట్టు ప్రాంతంలో ఆడుకుంటున్నాము అక్కడ చెరువులో
ఒక బోటు కనిపించింది ఆ చెరువులో నా మితియాలసకి ఆ
బోటు ఏర్పాటుచేసారు. ప్రొద్దున పనిమీదంచు కొసి, మ ధ్యా
హ్నం చెరువు ఒడ్డున బోటు పెట్టి వెళ్ళిపోయారు బోటు
వాళ్ళు. మేము ఏదో వింతగా బోటుతో చెరువులో షికారు
చేద్దామనిపించింది. అందరం బోటు ఎక్కాము. మాలో ఒక
డు గెడపట్టి బోటు నెట్టాడు. బోటు తిన్నగా చెరువు మధ్యలోకి
వెళ్ళింది బోటు అలా నీళ్ళలో వెళ్ళిపోతోంటే హాయిగా
సరదాగా ఉంది కాని చెరువు మధ్య నాచులో బోటు చిక్కు
పడింది. గెడవుచ్చుకొని ఎంత నెట్టినా బోటు కదలలేదు చెరు
వు మధ్యబోటులో దిగాలు పడికూర్చున్నాం అంతా సాయం
త్రం నాలుగు గంటలకు బోటువాళ్ళు వచ్చి మా కార్యక్రమం
చూసి దిగ్రాంతి చెందారు. బోటుగట్టుకు తెమ్మని అరిచారు
అసలు బోటు కదిలితేగా ఆ వార్త ఊరంతా ప్రాకింది. జనం
గుమిగూడి చెరువుగట్టుకు వచ్చారు ఆబోటులో ఉన్నవారి
బంధువులు. స్నేహితులు గట్టుమీదనుంచి లబోదిబో మంటూ
కేకలు, పెడబొబ్బలు పెడుతున్నారు. ఇంతలో సత్తిపండు

అనుకుంటూ, మరో కాయన చెరువులో ఈది నావను ఛేదిం చుకుంటూ ముందుకు వచ్చి, ఆ బోటు పట్టుకుని జాగ్రత్తగా తోసి, మమ్మల్నందరినీ బోటుతో సహా గట్టుకు చేర్చారు. చాలా భయం భయంగా అంతా బోటు దిగాము, బోటులోని ఇతర చిలి కాంగ్రెసు వాళ్ళ బంధువులు చెడామడ తిట్టి కొట్టినన్నానం చేశారు. నాతాలూకు ఎవరూ రాకుండా వున్నారని, నేనూ మాతమ్ముడూ పారిపోయాము. సాయంత్రం చీకటి పడ్డాక ఇంటికి వెళ్ళా. అప్పటికే ఈవార్త మానాన్నగారికి అందింది. ఇంటికి రాగానే ఆయన్ను ఇంటికాంపౌండులో, కుర్చీలో చుట్టకాలుస్తూ కూర్చొనడం చూశాము. మెల్లగా పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి రాగానే మానాన్న పులిలా గర్జించారు. అంతే దగ్గరకు వచ్చి ఒళ్ళు హూనమయ్యేలా చేత్తో కొట్టారు.

ఆ దెబ్బల నుంచి మా అమ్మ మమ్మల్ని రక్షించింది. అయితే చెరువుమధ్యలో ఇరుక్కున్నంతమాత్రాన చచ్చిపోతామా-ఎందుకంత భయం అందరికి అనిపించింది. కాశీమజిలీ కథలులోను, పూర్వ రాజుల కథలుల్లోనూ, ఏవో సాహస యాత్రలు చేసినంతగా లోలోపల ఆనదించాను.

## గోటి కాయలు

చిన్నతనంలో గోటికాయలు ఆడుకునే అలవాటు నా కుండేడిది. వీలుచిక్కినప్పుడు మాయింటిసందులోను, లేదా

చెరువు గట్టుదగ్గ ఆడుకునేవారం అలాగే గోటిబిళ్ళ ఆట కూడా. మా చెలికాళ్ళ వర్గంలో ఒక పెద్ద ఆజానుబాహుడు మిత్రుడు వుండేవాడు అతడి పేరు గుర్తులేదు ఒకరోజు గోటి బిళ్ళఆటలో అతడు ఓడిపోయాడు ఓడిపోతే బట్టలిప్పుకొని వీధిలో నడుస్తానని పందెం వేశాడు. ఓడిపోయాక వాడిని వీధి లో నడవాలని అందరూ పట్టుపట్టారు వాడు సిగ్గుపడ్డాడు అప్పటికివాడికి 13 ఏండ్లువయస్సువుంది. చివరకు అందరూ బలవంతగా వాడి వస్త్రాపహరణచేసి వీధిలోకి నెట్టారు వాడు ఇంటికి వెళ్ళేదాకా వీధిలో నగ్నంగా పరిగెత్తాడు నేను వెంట పరుగు–అల్లరి–ఒకే సరదాగా ఉంది ఆ దృశ్యం–వీధి లో జనం మా వీరకార్యానికి–ఒకతే నవ్వులు ఆడపిల్లలుకిటికి లోంచి తొంగితొంగి చూసి–పకపకనవ్వులు–మగధీరుడిలా సాయంత్రం ఇంటికి రాగానే మా నాన్న మాఅమ్మ ఒకటే తిట్టిదండకం చదివారు నామొక ముంగిలా కూర్చుని భోంజేసి పడుకున్నాను ఏమనాలో తెలియక.

పడవ ప్రయాణం

నా జీవితంలో మొట్టమొదటిసారిగా స్వతంత్రంగా ప్రయాణం ఒక పడవలో చేశాను. ఆలమూరునుంచి కోటిపల్లి

ఆ పడవ ప్రయాణం చేసింది. మా నాన్నగారు కో-ఆపరేటివ్ ఇన్స్పెక్టర్‌గా కోటిపల్లిలో వుంటూ, మా చదువుల కోసం మమ్మల్ని ఆలమూరులో వుంచేరు. ఒకసారి ఏవో అర్జంటు పనులుండడంవల్లనో మరెందుకో మా అమ్మ తప్పనిసరిగా నన్ను మా నాన్నగారి వద్దకు వెళ్ళిరమ్మంది. ఒంటరిగా ప్రయాణం చేయడం తెలియని నన్ను పంపడానికి చాలాసార్లు తర్జనభర్జన చేసుకుని, చివరకు నిర్ణయించి, ఎరుగున్న వ్యక్తిని ఎవర్నో నన్ను పడవ ఎక్కించమని పురమాయించి చేతిలో ఒక రూపాయి పెట్టి పంపించింది మా అమ్మ. బహుశా మా నాన్నగారు చాలా రోజులు ఆలమూరు రాకుండా కోటిపల్లిలో వున్నందువల్లనో, ఉత్తరాలకు జవాబు కూడా లేనందునో, ఆర్థిక ఇబ్బందులవల్లనో, నేను చెప్పలేనుగాని, తప్పనిసరిగా మా అమ్మ కోటిపల్లికి నన్ను ప్రయాణం కట్టించింది. గుండె బెదురుబెదురుగా, విచిత్రంగా తయారయింది నా మనస్తత్వం ఈ పడవ ఎక్కడికి పోతుందో? కాలవలో ఈ పడవ మునిగిపోతే, రాత్రి దొంగలుపడి ఈ పడవలో వున్నవారినందరినీ దోచుకుంటే? ఈ పడవవాళ్ళు ఎలాంటివాళ్ళు? ఇలాంటి విచిత్రవ్యూహాలు నా మనస్సులో మెలిగి నన్ను చాలా భయభ్రాంతుణ్ని చేశాయి అయితే పడవలో నన్ను ఆసామీ ఎక్కించిన తర్వాత, లోపల కూర్చున్నాను. వెనుకభాగంలో గుండ్రంగా వున్న పడవ నిమ్నతలంలో కూర్చున్నాను ఆ ప్రక్క ఎవరెవరో ఆడవారు మగవారు ముసలివాళ్ళు, మధ్యవయస్కులు కూర్చున్నారు.

వారి సంసార గొడవలు, స్వంత విషయాలు మాట్లాడుకుంటు న్నారు. నాకు ఎవరితో పరిచయం చేసుకోవాలో ఎలా మా ట్లాడాలో తెలిసి దికాదు. అలాగే కూర్చొని పడవ గోడు నుంచి బయటి ఆకాశం, కాలవ ఒడ్డుపై చెట్ల ఆకుల గలగలల వైపు చూస్తూ కూర్చున్నాను. అది రాత్రి ప్రయాణం. తెల్ల వారితే గాని కోటిపల్లి రాదు-రాత్రి అంతా బయంతో చీకటిలో అలాగే కూర్చున్నాను. ప్రక్కన ఒక సంచీ ఆ సంచిలో నా బట్టలు ఒకటి రెండు మాత్రం ఉన్నాయి. పడుకుందామంటే భయం ఏమౌతుందో అని చివరకు మగతనిద్ర కలత నిద్రపోయాను బెరుకు బెరుకుగా రాత్రి కాల్వగట్టు పైకదిలే చెట్ల ఆకులు, ఆకాశంలో మినుకు మినుకుమనే నక్షత్రాలు. కాలవ కెరటాల గలగలలు ఏదో విచిత్ర అనుభూతులు కలిగించాయి నాకు ఆ అనుభూతులు నాకున్న భయం కొంచం తగ్గించాయి ధైర్య చిక్కబట్టుకొని ప్రొద్దున్న కోసం, సూర్యోదయ కాంతి కోసం ఎదురు చూశాను. సుప్రభాతం ఎంతో మనోహరంగా వుంది. పడవ చుక్కాని దగ్గర ఉపరితలంపై నుంచొని పరిశీలిస్తుంటే ఎంతో హాయి అనిపించింది పక్షులు ఎగురుతూ కాలవ చెట్ల కేరింతలు కొడుతున్నాయి. సూర్యకిరణాలు ఒంటికి తగిలి గిలి గింతలు పెడుతున్నాయి. అదో మధు గాన భూతి-అనుభూతి ఆంతర్యంలో నాలో రచనా, కల్పనా పిపాస తొంగిచూస్తుం దని ఆనాడు నాకు తెలియదు. తెల్లవారిన పిదప, పదిగంటల ప్రాంతానికి కోటిపల్లి చేరుకున్నాను. మానాన్న ఎక్కడుంటా డో ఏమో నాకు తెలియదు-కాని కో-ఆపరేటివ్ ఇన్స్పెక్టర్

గారి ఆఫీసు కావాలంటూ మానాన్న పేరు చెబుతూ దారిన కనిపించినవారిని అడుగుతూ ఏదో రోడ్డుపుచ్చుకొని నడిచాను చేతిలో నుంచి నిక్కరు, చిన్నచొక్కా రాత్రి నిద్రలేమి బడలినముఖం. చెదిరినజుట్టు, పాదరక్షలు లేకుండా నడుస్తున్న నన్ను ఎవరైనా చోద్యముగా చూసివుండవచ్చు-చివరకుకోటిపల్లి సోమేశ్వరుని దేవాలయంఎదుట నాన్నగారి ఆఫీసు ఉందని తెలిసి ఆవైపునడిచాను ఒక ఎత్తరుగుల మట్టియిల్లు అక్కడ కో-ఆపరేటివ్ ఆఫీసు అనే బోర్డు కనిపించింది. మెల్లగా అడుగులు వేసుకుంటూ మెట్లు ఎక్కాను. నాన్నగారి పేరుచెప్పి ఉన్నారా' అని అడిగాను. ఎదురుగా కుర్చీలో కూర్చున్న గుమాస్తా ఆశ్చర్యంతో చూసి ఎవరబ్బాయివన్నారు-ఇన్స్పెక్టరుగారు మానాన్నగారన్నాను. గుమస్తాకు మరీ ఆశ్చర్యంవేసింది-ఏవూరినుంచి వచ్చావని అన్నాడు కళ్ళజోడు సరిజేసుకుంటూనన్ను పరీక్షిస్తూ, ఆలమూరునుంచి అన్నాను. ఒకనిముషం మౌనం వహించి, గుమాస్తా మెల్లగా అడుగులు వేసుకుంటూ మానాన్నగారి ఆఫీసు గదిలోకి వెళ్ళి నా సంగతి చెప్పారు. ఆయన మరీఆశ్చర్యపోయి కంగారుగా ఆఫీసు నుండి బయటికి వచ్చారు. ఏమిటి? ఇలా వచ్చావు ఇంటిదగ్గర అంతా కులాసా? ఎలా రాగల్గా అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తూ, నన్ను చేతులోకట్టుకొని లోపలికి తీసుకువెళ్ళారు మా నాన్న. నాకు పట్టరాని ఆనందం కలిగింది. "దా ఇంటికి వెడదాం" ఆఫీసు గది మూయించియింటికితీసు

కు వెళ్ళి స్నానం చేయించి, హోటల్ కు తీసుకు వెళ్ళి ఇడ్లీ వగైరాలు పెట్టించారు. దారిలో మా నాన్నతో వెడుతోంటే "ఈ అబ్బాయి ఎవరని" ఎరుగున్న వాళ్ళు అడగడం, మా వాడని మా నాన్న చెప్పడం నాకెంతో గర్వంగా ఉన్నట్టు ఉండేది. ఒకటి రెండు రోజులున్నాక మా నాన్న నేను తిరిగి బస్సులో వచ్చాము. మా నాన్నతో నేను ఇంట్లోకి అడుగు పెడుతోంటే. మా అమ్మకు విపరీతమైన సంతోషం కలిగింది మా తమ్ముడు అక్కా, అయ్యన్న చుట్టుముట్టారు, తరువాత మా నాన్న, అమ్మ, తను నవ్వులో ఏం మాట్లాడుకున్నారో నాకు తెలియదు.

ఈ అనుభూతి నా మెదడు చాలా పటిష్టంగా హత్తుకుపోయింది. కాలక్రమంలో సాహిత్య వ్యాసంగం ప్రారంభించాక 'రాయబారి' అనే కథ ఈ అనుభూతి ఆధారంగా వ్రాశాను. ఆ కథ ఆంధ్రపత్రిక వారపత్రికలో పడినప్పుడు ఎరుగున్న మిత్రులు, భార్యలుగల మిత్రులు నన్నెంతో అభినందించారు. వాస్తవికత, రసవత్తర అనుభూతులు భార్యభర్తల అనురాగ సంపద చిత్రించిన ఆ కథ నాకు చాలా ఇష్టమే. జీవితంలో కలిగే అనుభూతులు అక్షర రూపంలో సత్యంగా చిత్రించగలిగినప్పుడు పొందే ఆనందం బహుశా బ్రహ్మానందమేమో! అదే తృప్తి నాకు ఈ కథా చిత్రణలో జరిగింది.

## కనుబొమ్మ గాయం

ఒకరోజు నేను ఆటలాడుకుంటూ గెంతుతూ ఇంటి వైపు పరుగెత్తుకు వచ్చాను. ఇంటిగుమ్మంలో మాఅమ్మ, ఇతర అమ్మలక్కలు కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. నన్ను ఆటలో ఎవరో వెనక తరుముతున్నారు. అందువల్ల అమ్మలక్కలు కూర్చున్న గడపదాటి ఎగిరి ఇంటిలోకి పోవాలని ఒక్కదుముకు దుముకాను. మాఅమ్మ కంగారుపడింది తగ్గట్టుగానే నేను ఎగిరి వీధి తలుపుమీద పడ్డాను తలుపుకు వున్న పెద్ద మేకు ఒకటి నాకుడి కనుబొమ్మపై గట్టిగా గుచ్చుకుంది రక్తం స్రవించింది. అందరూ గాభరా పడ్డారు. తాటిపువ్వుం సున్నం, మొదలైనవి కట్టుకట్టారు. ఆగాయం మానడానికి చాలాకాలంపట్టింది. కానిఆగాయం మరచిపోకుండా ఇప్పటికీ నాకుడి కనుబొమ్మ పై భాగంలో పెద్ద గడిచార కనిపిస్తుంది. అదిజ్ఞాపకం వచ్చినప్పుడల్లా అనవసర గంతులూ, ఆటల్లోదుడుకుతనం తగ్గిపోయిందినాకు.

## బ్రహ్మణీకం-సంప్రదాయాలు

నాకు చిన్నతనంలోనే మా వాళ్ళు ఒడుగు చేశారు. నాకు ఒడుగు మాఅక్కా, భాను, పెళ్ళి ఒకేసారిజరిగాయి.

శాస్త్రోక్తంగా నాల్గు రోజులు నా ఒడుగు కార్యక్రమాలు నిర్వహించారు. సంధ్యావందనం నేర్పారు. ఆశ్లోకాలు మొదట నోరు తిరగటానికి కఠినంగా వున్నా, శ్లోక పఠనంలో నాకు ఎంతో అనక్తి కలిగేది. మా అమ్మగారి ప్రోత్సాహం వల్ల నేను సంధ్యావందనం యథావిధిగా చేసేవాణ్ణి-మూడు పూటలు కూడా-రాగి చెంబు, ఉద్ధరణి పట్టుపంచ నీళ్ళు వదలడానికి రాగిపళ్ళెం-ముఖ్యంగా నా సంధ్యావందన కార్యక్రమాలు చూసి నేను చాలా బుద్ధిమంతుడైన సద్బ్రాహ్మణుడనని పేరు గడించాను. చుట్టుప్రక్కల అమ్మలక్కలు సంభాషణల్లో నన్ను పొగిడేవారు. అలా మంచివాడినని పొగిడించుకోడం నాకూ చాలా ఇష్టంగా వుండేది ముఖ్యంగా మా అమ్మ గారు యీ సంప్రదాయ బ్రహ్మణీకం అక్షరాలా అమలు జరిపేలా కొంచెం కట్టుదిట్టం చేసేవారు. శివరాత్రి ముక్కోటి ఏకాదశి సుబ్రహ్మణ్య షష్ఠి ఇటువంటి పర్వదినాలలో నన్ను ఉపవాసం కూడా ఉండేలా మా అమ్మగారు ప్రోత్సహం చేసేవారు. ఓ ప్రక్క ఆకలి వేస్తున్నా పుణ్యం వస్తుందనే ఆశతో నేను ఉపవాసాలు చేసేవాడిని. అందువల్ల మా అమ్మగారితో సంప్రదించి ఆయా పర్వదినాలలో నన్ను బ్రహ్మడిగా అర్చన పొందడానికి, భోజనం చెయ్యడానికి ఇరుగు పొరుగు వారింటికి నన్ను ఆహ్వానించేవారు. నాకు తప్పని సరిగా భోజనాలకు వెళ్ళక తప్పేదికాదు.

ఒకసారి సుబ్రహ్మణ్య షష్ఠినాడు నన్ను పొరుగింటి గవరయ్యగారి భార్య బ్రాహ్మికగా బ్రహ్మచారిగా భోజనా

నికి ఆహ్వానించారు. నేను ఒప్పుకున్నాను. ఇటువంటి కార్యక్రమాలు నాపట్టాన మాఅమ్మగారే నిర్ణయించేవారు. ఐతే ప్రొద్దున్నే స్నానంచేసి మాతల్లి దండ్రులతో సుబ్రహ్మణ్యేశ్వరుని గుడికి వెళ్ళినమస్కరించి నాగుల చెరువు ప్రక్కన ఉన్న తీర్థం ఆనందంగా చూస్తూ ఇంటికివచ్చేశాను. తరువాత స్నేహితులతో కలసి వెళ్ళి తీర్థ ప్రాంగణానికి వెళ్ళాను. బూరాలు, గిరగిర చక్రాలు, డప్పులు, ఈలలు, అమ్మవాళ్ళు, కాజామిఠాయి, కారపూస, మిఠాయి అంగళ్ళు, పిల్లల ఆటవస్తువుల అంగళ్ళు-రంగులరాట్నం అక్కడ ఎన్నో ఉండేవి వీటన్నిటి మధ్య సీతారామయ్య హోటలు శాఖ ఒకటి అక్కడ ఏర్పరిచారు. ఆయన వేసే ఇడ్లీలు ఆలమూరు గ్రామంలో చాలా ప్రసిద్ధి. అలా తీర్థంలో నేను నా స్నేహితుడూ తిరుగుతూంటే సీతారామయ్య వేడి వేడిగా ఇచ్చే ఇడ్లీ సువాసన నాముక్కు పుటాలలో చేరి నానా అల్లరిచేసింది. అయితే నా దగ్గర డబ్బులు లేవు- కాని నా ప్రక్కనున్న స్నేహితుడి వద్ద డబ్బులున్నాయి. వాడు సరదాగా మాయిద్దరికీ ఇడ్లీలు కొన్నాడు. [ మేమిద్దరం రుచిగా చాటేసి ఆనందిస్తూ తిన్నాము తిన్నాక జ్ఞాపకం వచ్చింది "ఆరే" ఈరోజు గవరయ్యగారింట్లో భోజనంకదా! బ్రాహ్మణీకగా వెళ్ళాలికదా! ఏమీ తిన కూడదే ప్రొద్దున్న?! అని ఆలోచన రాగా బాధగా, భయంగా ఎవరూ నన్ను చూడలేదుకదా అని గబగబా ఆకొట్టువదలి వెళ్ళి పోయాం ఇద్దరం.

ఇంటికి వచ్చాక నా అమ్మగారి ప్రోత్సాహంతో ఆరవేసిన మడిబట్ట కట్టుకొని-చెంబుతో నీళ్ళు పట్టుకొని, గవరయ్య

గారింటికి భోజనానికి వెళ్ళాను మామూలుగానే ఆహ్వానించి మర్యాద చేశారంతా. గవరయ్యగారి భార్య నాకు బ్రాహ్మణునికి యిచ్చే ఉపాసనాజలం యిచ్చారు, నేను భోజనానికి ఉపక్రమించాను. మధ్యలో గవరయ్యగారిభార్య ప్రశ్నించింది 'సాంబూ' ఈవేళ ప్రొద్దున్న టిఫిను తిన్నావటగా. అని నాకు లోపల మతిపోయింది— 'అబ్బె' 'లేదే' అని పిరికిగా బుకాయించాను 'సాంబు తినలేదు అన్నాడు గదే! 'అంటూ గవరయ్యగారి భార్య తన కుమార్తె వైపు చూసింది. 'నిజంగా తిన్నాడు నేను చూశాను'- అంది గవరయ్యగారి కూతురు.

'పోనీలేవే' వాడు లేదంటున్నాడుకదా!' తింటేవాడి పాపంవాడిదే' అని గవరయ్యగారి భార్య సర్దుకుంది. కాని, నాకు ఆమె అన్న చివరిమాట దెయ్యంలా వెన్నంటింది. నేను పాపం చేశానా! బ్రహ్మణుడిగా వెళ్ళకపోతేనేబాగుండేదిగా అని లోలోపల మదనపడ్డాను - ఏది ఏమైతేనేం తర్వాత బ్రహ్మణుడిగా భోజనాలకి యితరుల ఇంటికి వెళ్ళడానికి మనస్కరించేది కాదు నాకు భోజనం,సంభావన, పళ్ళు, తాంబూలం పైకైతే క్రొత్తవస్త్రాలు ఇవన్నీ ఆకర్షణ అయినా, ఆనాడు నేను చేసిన పొరపాటు మనస్సును ఏదో హింసిస్తూనే ఉండి— తర్వాత కొన్నాళ్ళ దాకా నాకు బ్రహ్మణభోజనాలు సరిపడలేదు మాఅమ్మగారి ఆగ్రహమున్నా. అయితే మరొకసారి కాకినాడలో నేను చదువుకొనే రోజుల్లో మాదొడ్డమ్మగారింటికి భోజనానికి వెళ్ళాను ఒక పర్వదినాన బ్రాహ్మణుడిగా.

ఆరోజు వంటకాలు బాగున్నాయి. హాయిగా తిన్నాను. కాని అంతా తిన్నతరువాత భోజ్యాన దోషం వచ్చేసింది. నన్ను బ్రహ్మణుడిగా పెట్టుకున్న మా దొడ్డమ్మ తనపుణ్యం పోయిందని బాధపడింది. నేను అలాఅన్నం కక్కుకున్నందుకు ఎంత గానో సిగ్గుపడ్డాను అలా కక్కుకోవడం సభ్యత కాదు. సరిగదా సంప్రదాయాలను భగ్నం చేసిన వాడినైనాను. ఎందుకు కక్కుకున్నానో నాకు తెలియదు-అది నాతప్పు కాదు. ఐతే నాకు అంతర్గతంగా యీకర్మకాండ, పూజలు, పునస్కారాలు-వీటిమీద మోజు బాగా సడలిపోయింది దైవభక్తి నాకువున్నా, దేవుడున్నాడనేనమ్మకం నాకు వున్నా ఈ కర్మకాండలు చేయటం నాకు సుతరామూ యిష్టముండేది. ఈ భావాలు లోలోపల విప్లవరూపంలో పెల్లుబికుతున్నా తప్పనిసరిగా తల్లిదండ్రుల భయంవల్ల పూజలు చేస్తుండేవాడిని సంధ్యావందనం ఆచరించేవాడిని. బ్రాహ్మణేకలి పేలా భోజనాలకు వెళుతుండేవాడిని.

## తోలుబొమ్మలు-నాటకాలు

చిన్నతనంలో నాకు ఆ గ్రామంలో వినోదకార్యక్రమాలు చాలా తక్కువగా వుండేవి. అయినా మా గ్రామం మార్కెట్ ప్రాంతంలో గాంధీవిగ్రహం ఉన్నచోట అప్పుడప్పుడు

తోలు బొమ్మలాటలు ఆడేవారు. రాత్రి భోజనం చేసి అమ్మ, నాన్న మేమంతా ఆ ఆటలు చూడటానికి వెళ్ళేవారం, ఒకరాత్రి సమయం కాగానే అమ్మ, నాన్న తక్కిన వారు ఇంటికి వెళ్ళిపోయేవారు. నేను తెల్లవారేదాకా అక్కడే కూర్చొని ఆ తోలు బొమ్మలాటలు చూశేవాడిని. రామాయణం, భారతం గాథలు మామూలుగా తోలు బొమ్మలాటలాడేవారు. ఆ గాథలు సరిగ్గా అర్థం కాకపోయినా, నాలో ఆసక్తి కొంత పెంచాయి. ఆ గాథల ప్రభావం మనస్సులో చిన్నతనంలోనే నన్ను హత్తుకుంది. ముఖ్యంగా తోలుబొమ్మలాటల్లో గంధోళిగాడు వచ్చినపుడు నాకు విపరీతంగా సంతోషం కలిగేది. ఆ హాస్యం నన్ను అలరించేది అప్పటినుంచి హాస్యరసం మీద నాకు మోజు ఎక్కువ. అదే ప్రాంతంలో అప్పుడప్పుడు హరికథలు కూడా జరుగుతుండేవి. అవి అప్పుడప్పుడు విన్నట్లు జ్ఞాపకం.

ముఖ్యంగా మాయింటి ప్రక్కనే కోపరేటివ్ బ్యాంకుకు ఎదురుగా ఒక్కొక్కసారి నాటకాలు ఆడేవారు ఆ నాటకాల్లో హరిశ్చంద్ర నాటకం నాకు బాగా గుర్తు. ఆ గ్రామంలో గాజులు అమ్మే ఒక ఆసామి హరిశ్చంద్ర పాత్ర వేసేవాడు. పగలు గిరజాలు జుట్టూ లాల్చీ పంచతో గాజులు బుజాన వేసుకుని అమ్ముకునేవాడు. రాత్రి హరిశ్చంద్రుడుగా నటిస్తూంటే నాకు చాలా ఆసక్తికరంగా వుండేది. నాటకాలలో హరిశ్చంద్ర పాత్రకే అన్నట్లు అతను గిరజాలు పెంచుకునేవాడు. కాటి కాపరిగా అతను పద్యాలు చదువుతూంటే

నాకు ఒళ్ళు గగుర్పొడిచేది.

అక్కడే కోపరేటివ్ బ్యాంకులో ఒక ప్యూన్ వుండేవాడు. అతను ఆజాను బాహువు. మా నాన్నగారంటే అతనికిష్టం. నాకు అతని పేరు గుర్తులేదు, అతను కూడా నాటకాలలో వేసేవాడు. బూచీలాగా అతను వేషం వేసుకుని హఠాత్తుగా స్టేజి మీదకు తలుచొన్ని గట్టిగాఅరచి కేకలు పెడితే మేమంత గబుక్కున జడుసుకునే వాళ్ళం-తర్వాత నవ్వుకునేవాళ్ళం అటువంటి నాటకాలు వేసినప్పుడల్లా నేను చాలా ఆసక్తికరగా చూసేవాడిని. అలాగే వేషాలు వేసుకోవాలని సదాగా వుండేది. చిన్నతనంలో నాకు సుబ్రహ్మణ్యంగారని ఒక మేష్టారు కొన్నాళ్ళు పాఠాలు చెప్పారు ఆయన పోరంకి వారింట్లో వుండేవారు. మొట్ట మొదటిసారిగా ఆయన నాచేత నాటకం వేయించినట్లు గుర్తు. నాకిచ్చిన పాత్ర నారదుడు. నాకు సిల్కుచీర పంచగాగట్టి, నామం పెట్టి చేతికి చిడతలు యిచ్చి రంగస్థలం మీదకు పంపారు నేను పాడుతూ చిడతలు వాయించాలి. కాని చిడతలు వాయిస్తే పాట పాడలేకపోయేవాడిని.

రెండు చర్యలు కలిపి నటించడం కష్టంగా వుండేది. వచ్చిన అమ్మలక్కల జనం అందరూ నన్ను చూసి నవ్వారు. నాతోపాటు పెద్దింటి నారాయణ కూడా నటించినట్లు జ్ఞాపకం. అతను చాలాకాలం రాజమండ్రిలో డాన్సు మాష్టారుగా గుర్తు. ఆనాటినాటకాలమీద ఆసక్తి బీజమైనేను

బి.ఎ చదువుకునే రోజుల్లో కాకినాడ పి ఆర్. కాలేజిలో నాటకాలు వ్రాసి హాస్యంగా చిత్రించి నేను స్వయంగా నటించే అవకాశాలనుసృష్టించి నన్ను నటునిగా తీర్చిదిద్దింది.

తరువాత జీవితంలో అడుగుపెట్టాక సుమారు పాతిక సంవత్సరాలు నాటక రంగంలో పెద వేసుకున్న కార్యక్రమాలలో నిమగ్నుడినైపోయాను. మంచినాటకం చూడడమంటే ఇప్పటికీ నాకు చాలా ఆనందం.

## బంధువులు - ఆగమనాలు

ఆలమూరులో ఉన్నప్పుడు బాల్యంలో వచ్చే వెళ్ళే బంధువుల జ్ఞాపకాలు కొన్ని హత్తుకుపోయాయి. జ్ఞానం రాకముందు వచ్చేవారి గురించి విన్నాను — జ్ఞానం వచ్చాక కొందరిని స్వయంగా చూశాను. మా నాన్నగారు దత్తత పుత్రులు కావడంవల్ల, ఆ రోజుల్లో ఇరవై ఎకరాల మాగాణి భూమికి హక్కుదారులు కావటం వలన, మా నాన్నగారు కొంచెం దర్జాగా వుండేవారని ప్రతీతి. బంధువులు కోనసీమనుంచి గోదావరి దాటి వచ్చి మా ఊరి మీదుగా వెడుతుంటే, అమ్మలక్కలందరూ మా యింట్లో విడిది చేయడం, వారికి సంతృప్తిగా అన్న సంతర్పణ, వస్త్రదానం చేస్తేగాని అమ్మగారికి, నాన్నగారికి తృప్తి ఉండేది కాదుట — ఈ

అలవాటు బాధువులు మరిచిపోలేక తరుచు వచ్చి నూతన వస్త్రాలు కట్టుకు పోతూండేవారు. "సూరమ్మగారు అన్నపూర్ణ" అంటే మా తల్లి పొంగిపోయేది. మీరు శిబిచక్రవర్తి వంటివారు అంటే మా నాన్న పొంగిపోయేవారు. ఈ బంధువుల రాకపోకల ఫలితాలవల్ల ఆయన ఆస్తి కూడా తరిగిపోయిందని వదంతి. ఏది ఏమైనా విశృంఖలంగా ఖర్చు చేసే అలవాటువల్ల జ్ఞాతుల దావాలవల్ల ఆస్తి కరిగిపోయిన మాట వాస్తవం - ఆ రోజుల్లో బంధు మర్యాద చేయక పోతే సంప్రదాయం కాదు. ఈ రోజుల్లో బంధువులు కనిపిస్తే పది మైళ్ళ దూరం కనిపించకుండా చాటు ముఖం పెట్టుకుపోయే సంప్రదాయము మంచిదైంది.

## పంపునీళ్ళు - మొక్కలు

మా యింటి దొడ్డి చాలా పెద్దదిగా వుండేది. దొడ్డి నిండా అరటి, నారింజ, జామి, దానిమ్మ, సీతాఫలం— మొదలైన వృక్షాలు వుండేవి. ప్రతి సాయంత్రం ఆ మొక్కలకు నీరు పోయడం సరదాగా యిప్పటికీ ఇష్టమేకాని, అవకాశం సమయం మాత్రం నేడు చిక్కటం లేదు. ఆవూళ్ళో ఇంట్లో చాలా మందికి నూతులు ఎక్కువగా వుండేవి. కాని పంపు పెట్టుకున్న వాళ్ళు కొద్దిమంది మాత్రమే. ఆ కొద్ది మందిలో

మా కుటుంబం కూడా వుండేది. ఇంట్లో పంపు వుంటే అదొక పరపతి-సమాజంలో స్థాయి పెరిగేది. ఆనాడు పంపు దగ్గర కూర్చుని ఎన్నో సార్లు సరదాగా నీళ్లు పోసుకోవడం హాయిగా వుండేది నేను నీళ్ళు పోసుకుంటూ వుంటే, అమ్మో, అక్కో, ఎవరో ఒకరు నీరు పంపు నుంచి తోడేవారు. ఒక్కొక్కసారి పంపు ఎండిపోతే పైపు నోటిలో నీళ్ళు పోసి లోపలి నుంచి నీరు పైకి తెప్పించేవారు. పైపు నోరు చిత్రంగా వుండేది అందులో ఏదో కొద్ది నీరు మిగిలేది తోడడం ఆపేశాక ఎండకు కొంత నీరు ఇంకిపోయినా మిగిలిన నీరు అందులో చిన్న కొలనులా వుంటే చిన్న చిన్న చేపలు అందులో పడేసి, అవి ఈది అల్లరి పడుతుంటే కేరింతలాడు కునే చిన్నతనం బుద్ధి మరపడం కష్టం. మొక్కలకు మడులు చేసి నీరు పైపు చట్టనుంచి పారి, కాలువ గుండా పోతుంటే, చిన్న చిన్న కాగితం పడవలు వేసుకుని మునిగిపోయేవాళ్ళం నేనూ, మా అక్కా, తమ్ముడూనూ మొక్కలకు, అరటి చెట్లకు బోదెలు చెయ్యడం నీరు పారేలా కాల్వలు శుభ్రం చేయడం సరదాగా వుండేది. బోదెలు చేసేటప్పుడు కాల్వలు ఏర్పరిచేటప్పుడు, మట్టిలోంచి ఎలుగు పాములు ఒక్కొక్క సారి బయటికి వస్తే కొంచెం భయం చికాకు వేసేది. అయితే నీళ్లుపోసి పెంచుతున్న ఆ జిల్లాకు కాయలు కోసి నప్పుడు, చాలా ఉత్సాహంగా అవి కొనుక్కుని సంతోషించే వాళ్ళం. ఇప్పటికీ తోట పెంచాలనే సరదా నాలో పరవళ్లు త్రొక్కుతూంటుంది.

## అట్లతద్ది

అనేక విధాల ఆ ఊరి పిల్లలతో ఆడుకోడం సంతోషంగానే వుండేది. కాని అట్లతద్ది మాత్రం కొంత ప్రత్యేక ఉత్సాహం కలిగించేది. తెల్లవారు జామునే లేచి, ముఖం కడుక్కొని, వీధిలోకి కుర్రవాళ్ళతో పోయి, సన్నని వెన్నెల రాత్రిలో పరుగు పందాలు, చెడుగుళ్ళు - ఆడుకునేవారం ఆడవాళ్ళంతా కలిసి ఒకరి ఇంటి పెరటిలో చేరుకొని తుమ్మొండ, చెమ్మచెక్క ఆడుకునేవారు. ఆ సమయాలలో కొందరు కొంటె కుర్రవాళ్ళతో ఆడవాళ్ళకు గుచ్చుకునేలా పల్లేరు కాయలు జల్లుచూసి, ఆడవాళ్ళు చెల్లా చెదరై గప్ చిప్ అయిపోయేవారు. అది సరసమో, విరసమో కాని ఆ వింత మాత్రం సరదాగానే వుండేది. ఆటలు పూర్తి చేసి ఇంటికి రాగానే చక్కగా తలంట్లు పోసుకుని, వీలైతే క్రొత్త బట్టలు, లేదా ఇస్త్రీ బట్టలు తొడుక్కొని పండుగ చేసుకునే వారం.

## తలపై గాయం

మా నాన్నకు ఒక సైకిలుండేది ఆ సైకిలుపై ఆయన అనేక పర్యటనలు చేసేవారు కో-ఆపరేటివ్ ఇన్స్పెక్ట

రుగా ఆయన అనేక గ్రామాలు ఆ సైకిలు మీదనే తిరిగే వారు. ఒక్కొక్కసారి ఆ సైకిలు నేను నేర్చుకోడానికి ప్రయత్నించి, క్రింద పడడం మామూలే. చివరకు ఎలాగైనా సైకిలు తొక్కడం నేర్చుకున్నాను. ఒకరోజు మా నాన్న మధ్యాహ్నం భోజనంచేసి తాంబూలం నములుతూ దొడ్లో పాకలో వున్న సైకిలు తెమ్మన్నారు నన్ను నేనూ మా తమ్ముడు ఆ సైకిలును పాక బయటికి తెచ్చి రోడ్డుమీద నిలబెట్టాలనే ప్రయత్నంలో పరుగు పరుగున పాకలోకి దూరాం అయితే మా తమ్ముడి కంటె కొంచెం పొడగరి కావడంతో పాకలో దూరుతున్నప్పుడు పాకలోని గెడకర్ర తలలో సర్రున గుచ్చుకుంది నాకు కొంచెం నొప్పి పెట్టింది. అదే పోతుందిలే అనుకుని సైకిలు తీసుకుని బయటికివచ్చాను. నా తలమీద బలమైన గాయం తగలడంవల్ల రక్తం చిప్పుడి నెత్తిమీది గంగలా ఉబికి ఉబికి పైకివస్తోంది. అది మా నాన్న హఠాత్తుగా చూసి నివ్వెరపోయారు. తన ప్రయాణం ఆపుకొని తక్షణం నన్ను సైకిలు మీద కూర్చోపెట్టుకొని చలపతి ఆసుపత్రికి తీసుకు వెళ్ళారు. తలమీద గాయం కడిగి మందు వేసి కట్టుకట్టారు చలపతి డాక్టరు ఏమిటో నేను ఏడ్వ లేదు. బాధకూడ లేదు. అంత రక్తం కారినా కాని మర్నాటి నుంచి కొన్ని దినాలు ఆ గాయంవల్ల బాధపడ్డాను. ఆ గాయం నెత్తి మాడుమీద కల్గించిన చార ఈ నాటికీ గుర్తులా కనిపిస్తుంది ఈ గుర్తు మరువరానిది. నా దుడుకు తనానికీ, ఆ వేశానికి ఒక ప్రతిబింబంగా వుంటుంది ఆ గుర్తు.

# చలపతి ఆసుపత్రి

ఆలమూరులో నిత్యం నా మనసులో మెదలుతూ హత్తుకుపోయినది చలపతి ఆసుపత్రి అచ్చటకి వైద్యానికి తరచు నే వెళ్ళడం జరుగుతుండేది. ఆ ఆసుపత్రిలో పిచ్చి వాళ్ళుకూడా వుంటారని మొదటలో నాకు తెలియదు కాని చలపతి డాక్టరు నౌకరు సత్తిగాడు పిచ్చివాళ్ళ నమువులో పెట్టడంలో ఆరితేరినవాడు. ముఖ్యంగా మా చిన్న మేన మామకు మొదటిసారి మతి భ్రమించినపుడు ఆలమూరు ఆసుపత్రిలో చేర్పించారు అదే సమయములో నేను తక్కిన పిచ్చివాళ్ళను క్రమక్రమంగా చూడటం తటస్థించింది మా మేనమామ దగ్గరగా వెళ్ళి పలకరించడం చాలా భయంగా వుండేది. మా నాన్న వున్నపుడు కొంచెం చనువుగా వెళ్ళే మేము తరువాత మా చిన మామకు తరుచు మతి భ్రమించడంవల్ల మా నాన్నగారు చనిపోయినాక కూడా చలపతి ఆసుపత్రికి ఆయన కోసం తరుచూ వెళ్ళవలసి వచ్చేది. ఆ ఆసుపత్రిలోని పిచ్చివాళ్ళ వలన నాకు చాలా జ్ఞానోదయం కలిగింది. వారి మనస్తత్వాలు బాధలు ఆవేశాలు, విచిత్ర సంఘటనలు నన్ను జీవితంలో వెన్నంటాయి. నా రచనల్లో నేను అనేక పిచ్చి పాత్రలు సృష్టించి ఆ పాత్రల ప్రత్యేకతకు పాఠకుల మన్ననలు పొందాను ఆ పిచ్చివాళ్ళు ప్రపంచం అంతా చూసిన వ్యక్తుల్లా మాట్లాడుతారు వారి మానసిక సంఘర్షణ మానసిక ఆవేదనకు మూలము.

గ్రామ పరిసరాలు

బాల్యం జీవితంలో అనేక మధుర స్మృతులను ఏరు కొంటుంది. అవి మనస్సుకు హత్తుకు పోతాయి. ఆ మూరు గ్రామ పరిసరాలు తలుచుకుంటే ఏదో సినిమాలా కళ్ళముందు కదులుతాయి. ఆ గ్రామంలోని రోడ్లు పేరు ఏవో గుర్తు లేదు కాని చాలావరకు ఊరంతా గుర్తు. మే మున్న వీధిలో పోరంజివారు, దొడ్డవారు, నరసింహదేవర పేరు కెక్కిన వారు. మరి పెద్దింటివారు పోతు ప్రగడ వారు తని కెళ్ళవారు కూడా ఆ గ్రామంలో పెద్దలుగా పరిగణింప బడుతుంటారు. నాగుల చెరువుకు మా అమ్మతో మేము వెళ్ళడం స్నానాలు చేయడం జ్ఞాపకం అమ్మలక్కలు నాగుల చెరువునుంచే మంచి నీరు తెచ్చుకునేవారు. ఆ నాగుల చెరువుగట్టున నారికేళ చెట్లు, రావిచెట్లు, గాలికి గలగల కదలుతూ రివ్వుమని వీస్తుంటే అదొక సరదా రొదలు శ్రవణులకు ఆనందం కలి గించేవి. నాగుల చెరువు గట్టున సుబ్బరాయుడుగుడి దగ్గర ఊరి పెద్దలు వాహ్యాళిగా కూర్చునేటట్లు చప్టా చేయించారు. సాధారణంగా సాయంత్రం మా నాన్నతోగాని, స్నేహితులతో గాని ఆ చప్టాలపైవు వెళ్ళి కూర్చునేవాణ్ని ఆ గ్రామంలో చాలామంది సాయంత్రం కబుర్లకు ఆ చప్టాల ప్రాంతం సరదాగా వుండేది.

ఒకాయన పేరు గుర్తులేదు. సాయంత్రం నీళ్ళలో శ్వాసం పెట్టుకుని వెల్లకితలా తేలి సంధ్యావందనం చేసుకునే వారు చాలామంది శ్రోత్రియులు సాయంత్రంనాగులచెరువులో స్నానం చేసుకొని సంధ్య వార్చుకునేవారు

ఆ నాగుల చెరువు ప్రాంతదృశ్యాలు నా మనస్సుకు హత్తుకుపోయాయి. ఈ దృశ్యాల ఆధారంగా నేను అనేక కథలు వ్రాశాను. నాగుల చెరువుకు అవతలగట్టున అమ్మవారి ఆలయం వుండేది అక్కడ జాతర జరిగేది. అమ్మవారి ఆలయ వీధికి సమాంతరంగా వున్న మరొకవీధిలో జనార్దన స్వామికోవెలవుంది. దాని ప్రక్కనే రథం ఆ చుట్టుప్రక్కల పురాణ పండ వారు నిమ్మగడ్డవారు ఆరోజుల్లో ప్రసిద్ధి. ఇప్పుడు కొన్ని కుటుంబాలు మారివుండవచ్చు. జనార్దన స్వామి కోవెల వీధిలో నాకు ప్రాణమిత్రుడు గున్నేశ్వర్రావు వుండేవాడు. అతను దత్తపుత్రుడనుకుంటూ - చాలా కులాసాగా వుండేవాడు. చిన్నతనంలోనే పెళ్ళయిపోయింది. అతని పెళ్ళి సరదాలు పెళ్ళాంతో సరసాలు చిత్రాతి చిత్రంగా చెప్తూంటే వినిఆనందించేవాడిని. గున్నేశ్వర్రావుకు సైకిలుండేది. ఆ సైకిలుమీద అప్పుడప్పుడు నేను క్రొత్తూరు స్కూలు వెళ్లే పిదప నేను బి ఏ. పూర్తిచేసిన పిదప గున్నేశ్వర్రావును రాజమండ్రిలో చూసాను. చాలామంది పిల్లలతో ఏదో గుమస్తా వుద్యోగం చేస్తూ రాజమండ్రి గోదావరి గట్టు నిమ్మ భాగంలోని యిళ్ళల్లో వుండడం చూశాను. అప్పటికే అతనికి జీవితంలోని రసం హరించి

నీరసం వ్యాపించింది. ఖులాసా తనం సన్నగిలి పోయింది. బ్రతుకు బాధ్యతలు బహుశః ఒత్తిడిలో బాధాకరమైన సంసారిగా మారిపోయాడు. ఆలమూరులో కాలవ కెళ్ళే దారిలో గణపతి విగ్రహం నాకు మక్కువ ఎక్కువ. ప్రతీ పరీక్ష పాసు చేయిస్తే ప్రతీ సంవత్సరం ఆ గణపతికి కొబ్బరి కాయలు కొట్టేవాడిని. ఆ గణపతి కోవెల కానుకున్న రావి చెట్టు ఆ రావిచెట్టుకు ఎడమవైపున ఆనుకున్న పిల్ల కాలువ బజారు వీధికి దారి తీస్తుంది. ఆ బజారులోనే బ్యాంకు వుండేది. ఆ బ్యాంకులోనివారు మా నాన్నకు స్నేహితులు బహుశా వుద్యోగరీత్యా కూడా మా నాన్న ఆ బ్యాంకులో రోజు వెళ్ళేవారు అక్కడ మా నాన్నతో వెడుతుంటే నాకూ గౌరవం బాగా వుండేది. ఆ బ్యాంకు కాంపౌండులోని జామిచెట్టు కాయలు కోసుకొని తింటూంటే ఎవరికైనా తెలిసినా నరసింహామూర్తిగారి అబ్బాయి అని ఏమీ అనే వారు కాదు.

ఆ బ్యాంకుకు ఆనుకుని సీతారామయ్య హోటలు వుండేది నల్లమందువారి సోదరులు ఆ ప్రక్కనే ఒక జనరల్ స్టోర్సు తెరిచారు. వారిపేర్లు గుర్తులేవు కాని బహుశా నల్లమందు అమ్మడం వలన ఆ సోదరులను అలా పిలిచేవారు అక్కడ బస్సులు ఆగేవి. రాజమండ్రి, కాకినాడ పోవడానికి అది బస్సుకూడలి ఆ బజారులో బుల్లోడు కిరాణాకొట్టుకు నేను తరుచు పోయి వచ్చేవాడిని అక్కడ కూడ అరువు

నిత్యం ఆ కిరాణా దుకాణం పరిసరాలు ఈగలుగా జన యిప్పటికీ ఎంతో చిత్రంగా జ్ఞాపకం నాకు.

ఆలమూరునుంచి కొత్తూరుకు పోయే దారిలో వూరి పొలిమేరలో హరిజనవాడ గుడిసెలు రోడ్డు ప్రక్కగా వుండేవి. ఆ వాడలోని జనం నాకు చాలా చిత్రంగా అగుపించేవారు. సగం పైగా పెద్దలు, పిల్లలు అర్ధనగ్నంగా స్త్రీలుకూడా రవిక లేక వుండేవారు, పురుషులు ఎక్కువ చుట్టకాల్చేవారు. స్త్రీలుకూడా చుట్టనిప్పు నోటిలో పెట్టుకొని తలక్రిందులుగా కాల్చేవారు. వారి ఆచారాలు, పద్ధతులు శుభ్రతలేమి, దారిద్ర్యం నాకు చాలా జాలి కలిగించేవి. నాకు తెలిసినవారు ఆ వాడలో లేరుకాని, మా నాన్నగారి ఆఫీసర్లు, గ్రామ మునసబు, కరణం యిళ్ళకు హరిజనవాడ పెద్దల్ని పిలిచి ఏవో రాచకార్యాలు చేసేవారు.

ఆలమూరు మధ్యలో రామాలయం వుంది. బజారుకు సన్నిహితంగా దానికి కొంచెం దూరంగా ఎత్తు అరుగుల నానుకొని ఒక కోవెల వుంది. ఆ కోవెల బహుశా శివాలయమో, విష్ణాలయమో నాకు గుర్తులేదు. కాని ఆ అరుగుల మీద సాయంత్రం వూరి పెద్దలందరూ చేరి పేకాట వేసేవారు. పేకాటలో సుమారు 20 మంది పైగా పాల్గొనేవారు డబ్బుపెట్టి పేకాడేవారు. రూపాయి నాణాలు ప్రతీ ఆట చివరా ఒకరి చేతులనుంచి మరొకరి చేతులోకి ఖంగుమని మ్రోగుతూ జారుతూండేవి. ఎప్పుడైనా అర్జంటు పని

పడినా, డబ్బు కావలసి వచ్చినా. మా అమ్మ నన్ను రాయబారిగా పంపించేది మా నాన్న వద్దకు. మా నాన్న తరుచు ఆ కోవెల పేకాటలో భాగస్వాములే. నేనువస్తే ఒక్కొక్క సారి విసుక్కునేవారు. లేనప్పుడు డబ్బుయిచ్చి పంపించేవారు. అందులో కొందరు పేకాటలో ముక్కలు కలియలేదని అరుస్తూ కేకలుపెట్టడం, విసుక్కోవడం వినిపించి చిత్రంగా వారివైపు చూసేవాడిని. ఆ పేకాటవల్ల మా నాన్న చాలా ధనం పాడుచేసుకున్నారని నేను తర్వాత విన్నాను. మా అమ్మ ఎప్పుడూ ఇంటివద్ద పోరుపెడుతూండేది పేకాట మానమని. ఎదుగుతున్న పిల్లలైన మా కోసం కొంచెం జాగ్రత్త పడమని, మా నాన్నగారు దత్తులు 20 ఎకరాల మాగాణి భూమికి వారసులు మా యింటిలోనే ఆయన దత్తత తల్లి మూర్తెమ్మగారు కూడా వుండేది. ఆవిడకు యీ పేకాట తెలిసినపుడు కొడుకును పిలిచి మందలించేది కాని అప్పటికే తల్లీ కొడుకులు విడిపోయి ఎడ మొఖం, పెడ మొఖం పెట్టుకొన్నట్లున్నారు. అయినా మూర్తెమ్మగారికి కొంత మాగాణిభూమి ఆమె పేరన పెట్టుకున్నందున తదనంతరం వాళ్ళకు మాత్రం మా నాన్న వారసులయినారు.

మా నాన్నను మా అమ్మ ఆస్థి గురించి అడిగి పోట్లాడడం, ఒక్కొక్క ఎకరం అమ్మబడుతూంటే మా అమ్మ ఏడుస్తూండడం- కొన్ని దృశ్యాలు బాగా జ్ఞాపకం. చివరకు ఆయన చేతులారా ఆస్తి అంతా అమ్మేసే పరిస్థితి ఏర్ప

డింది. దాయాదులవల్ల ఏదో అగ్రిమెంటు చింపబడిన సందర్భంలో కోర్టు కేసులలో చిక్కుకుని పూర్తిగా వోడిపోయి, ఆస్తి పోగొట్టుకొన్నారని వినికిడి. దానితోపాటు పేకాట వ్యసనం మా నాన్నను పూర్తిగా నిరుపేదని చేసింది.

చివరిసారి పూర్తిగా ఆస్తి అంతా తగులబెట్టుకుని, ఇంటికివచ్చి కన్నీరు మున్నీరుగా బాధపడుతూ నన్ను చేరదీసి నీకు కావలసినంత చదువు చెప్పిస్తానని ఆయన ఖిన్నుడవడం నే నెరుగుదును. అయితే ఆయన తరువాత ఎంతవరకు యీ విషయంలో కృతకృత్యుడైనది కాలమే చెప్పింది. కాలమే ఆయన్ను త్వరగా యీ లోకం నుంచి తీసుకుపోయింది.

ఈ బాల్యం తలపులు ఆలమూరు గ్రామం గురించి హృదయానికి చాలా హత్తుకుపోయాయి. మా నాన్నగారికి కోటిపల్లి బదిలీ అయింది. అందువలన మేము సకుటుంబంగా కోటిపల్లి వెళ్ళవలసి వచ్చింది.

## కోటిపల్లి

మేము సకుటుంబంగా కోటిపల్లి వచ్చాక సోమగుండం దగ్గరగా ఒక యిల్లు దొరికింది. ఆ యిల్లు మానాన్నగారి ఆఫీసుకు దగ్గర-మట్టి అరుగుల యిల్లు లోపల కొంత గచ్చు వున్నా మొత్తం ఇల్లు విశాలంగా వుండేది సుమారు వంట యింటితో నాలుగ్గదు గదులు చుట్టూ కాంపౌండుతో అందంగానే వుండేది ఆ యిల్లు. అరుగుమీద నిలుచుని చూస్తే సోమగుండం - లోపల నీరు-ఆ నీటిపై నుంచి వచ్చే

కెరటాల గాలి- ఎదురుగా సోమేశ్వరుని గుడి సోముగుండం ఆ వైపు బజారుకుపోయే రోడ్డు—అన్నీ స్పష్టంగా కనిపించేవి. తోచనప్పుడు వీధి అరుగుమీద కూర్చుంటే ఎంతో కాలక్షేపము అయిపోయేది. అయితే మా యింటికి ఒకవైపు కంసాలి ఇల్లు- మరొకవైపు తెలికలవాని గానుగ యిల్లు వున్నాయి, ఒక వైపునుంచి సుత్తి చప్పుళ్ళు- మరోవైపు గానుగ కిర్రు చప్పుళ్ళు నిత్యం వినటూనే వుండేవారం ఆ చప్పుళ్ళ మధ్య-ఆ యిల్లు ఆ విధంగా వుండడం వాస్తుశాస్త్ర రీత్యా మంచిది కాదని మా యింటికి వచ్చిన బంధువులు అమ్మలక్కలు అనడం తద్వారా మా అమ్మకూడా ఆ ఇల్లు మార్చమని పోరుపెడితే, మా నాన్న కేకలు వెయ్యడం నాకు గుర్తే.

కోటిపల్లిలో నాకు పెద్ద చదువులకు వీలు కలగలేదు. అక్కడ అయిదవ క్లాసు వరకే పాఠశాలవుంది నేను తప్పని సరిగా మూడవఫారం చదువుకు కాకినాడ రావలసివచ్చింది. మా తమ్ముడు చెల్లెలు కోటిపల్లెలోనే చదువుకునేవారు. నేను కోటిపల్లెనుంచి కాకినాడ బస్సుకాని రైలుకాని ఎక్కి-సెలవులైనపుడు ఒంటరిగా ప్రయాణంచేసి, అటు కాకినాడ ఇటు కోటిపల్లి తిరుగుతూండేవాడిని. కాకినాడలో నన్ను మా దొడ్డమ్మ ఆదిలక్ష్మిగారింట్లో చదువుకు ఏర్పాటు చేశారు మా నాన్న. ప్రతి నెలా నా గురించి కొంత డబ్బు పంపుతానని ఆయన వాగ్దానం చేయగా, మా దొడ్డమ్మ నన్ను తన దగ్గర పెట్టుకుంది అయితే మా నాన్న అప్పటికే అప్పటికే ఆస్తి ధ్వంసం చేసుకొని ఉద్యోగ జీతంమీద ఆధారపడి,

వున్న పేకాట వ్యసనంకు దూరం కాకున్నందున, మా దొడ్డమ్మకు డబ్బు పంపక యిబ్బంది పెట్టేవారు ఆ ఇబ్బంది వల్ల మా దొడ్డమ్మ అగ్రహావేశపరురాలై మా నాన్నపై దండకాలు వల్లించడం, ఆయన వచ్చినపుడు మందలించడం జరుగుతూనే వుండేది. అయినా అన్నీ విని, చిరునవ్వుతో ఆయన వెళ్ళిపోయేవారు కోటిపల్లి.

కోటిపల్లికి దగ్గరగానే గోదావరి ప్రవహిస్తూండేది ఆ గోదావరి గట్టు ఎక్కువగా దుబ్బులమయం, పడవ రేవులు వున్నాయి స్పష్టంగా. కోటిపల్లి రేవు దాటితే కోనసీమ. ముక్తేశ్వరం చేరుకోవచ్చుననేవారు. ఆ గోదావరి గాలికి తన్మయుడనై కోటిపల్లికి సెలవులకు వచ్చినపుడు అలా వాహ్యాళీ వెడుతూ వుండేవాడిని కోటిపల్లిలో నాకు పెద్ద స్నేహితులు ఎక్కువగా పెరిగినట్లు గుర్తు లేదు ఎక్కువ సేపు వీలుంటే సోమేశ్వరుని ఆలయంలో ఆడుకునే వాళ్ళం. కోటిపల్లి శిరస్తాదారుగారి అమ్మాయి (పేరు గుర్తు లేదు) తన తమ్ముళ్ళతో సోమేశ్వర ఆలయ మంటపం వద్దకు రావడం, మేము ఏదో ఆడుకోవడం జ్ఞాపకం. శిరస్తాదారు గారి అమ్మాయి అంటే నాకు లోలోపల ఏదో మోజు, సంతోషం కలిగేవి. కాని మాకు ఎక్కువ స్నేహం పెరగ లేదు. ఆమె కూడా నేనంటే యిష్టమైనట్లు ప్రవర్తించినా, ఎదిగిన పిల్ల కావడంవల్ల దూరం దూరంగానే వుండేది ఎప్పుడైనా ప్రైవేటు మాష్టారివద్ద మేము కలిసి ట్యూషను చెప్పించుకునే వాళ్ళం అని గుర్తు.

కోటిపల్లిలో శివరాత్రికి బ్రహ్మాండమైన తీర్థం జరి

గేది. ఆ తీర్థం చాలా రోజులు పైగానే వుండేదని జ్ఞాపకం. జనం వేలాదివేలు అక్కడికి వచ్చి సోమేశ్వర సందర్శనం చేసుకొనేవారు. తీర్థం సుమారు వూరంతా వ్యాపించి వుండేది. అన్ని చోట్ల దుకాణాలు ఎన్నో వెలిసేవి. మా యింటి అరుగులు కూడా తీర్థం దుకాణాలకు అద్దెకివ్వవలసి వచ్చేది. అయితే ఆ తీర్థం సంబరం నాకు చాలా సరదాగా వుండేది, రకరకాల జనం గుంపులు గుంపులుగా కనిపిస్తే నాకు చూడడానికి వేడుకగా వుండేది. ఆ సరదా ఇప్పటికీ వుంది.

జనం మధ్య తిరగడంలో వున్న సంతోషం ఎన్నో పదుపాయాలతో ఒంటరిగా వున్నప్పుడు నాకు లభించదు. చిన్ననాటినుంచి తీర్థాలు, సంతలు, సంబరాలు, భజనలు, యాత్రలు అంటే నేను చెవి కోసుకొనేవాడిని. ఆ కోటిపల్లి తీర్థం నాకు చాలా కాలక్షేపంగా వుండేది. తోచినప్పుడల్లా తీర్థంచుట్టూ షికారు కొట్టి వచ్చేవాడిని.

కోటిపల్లి లో పేరయ్య అనే గుమాస్తాయో, నౌకరో మా నాన్నగారి వద్ద పనిచేసేవాడు అతను పొడుగ్గా, ఇద్దరు పంచె, లాల్చీ, కండువా వేసుకుని శుభ్రంగా వుండేవాడు. నేనన్నా, మా యింట్లో పిల్లలన్నా చాలా ఆప్యాయంగా చూసేవాడు. అందువల్ల నాకు అతనంటే చాలా అభిమానంగా వుండేది. పేరయ్య మా ఇంటి వ్యవహారాలన్నీ చాలావరకు సర్థ చేసినాడు. మా అమ్మ చెప్పిన పనులు మా నాన్న చెప్పిన పలును విసుగు లేకుండా చేసేవాడు. మా నాన్నకు కూడా నమ్మిన బంటులాగే వుండేవాడని ప్రతీతి.

అక్కడ మేము వుండగా మా పెద్ద బావగారు ఒకసారి కోటి పల్లి వచ్చినట్టు జ్ఞాపకం అప్పటికే మా అక్క భానుకు పెళ్ళి అయిపోయింది. నాకు ఒడుగు చేశారు. ఈ రెండు శుభకార్యాలు ఆలమూరులోనే పోరంకి వారింట్లో జరిగాయి అయితే మా బావగారు విచిత్రమన స్తత్వం కలవారు రసికుడు, రకరకాల సరదాలంటే ఆయనకు మరీ సరదా. కొంచెం ఆధునికంగా పట్నవాస పురుషుడిగా బ్రతకాలని ఆయన ఉత్సుకత, భార్యా సమేతంగా సరదాగా అలా అలా షికార్లు కొట్టాలని ఆయన కోరిక కోటిపల్లి కొంచెం పల్లెటూరు లాంటిది. ఆనాటి ఆ ఘ్రాళ్ళో మా బావగారికి అటువంటి కోరిక కలిగింది. ఒకనాటి సాయంత్రం బాగా ముస్తాబయి భార్యా సమేతంగా షికారు బయలుదేరడానికి ఉద్యమించారు. ఆయన ఆ పల్లెటూళ్ళో యిది మంచిగా ఉండదని మా అమ్మ వాదన. మా అక్కకు బిడియం వెళ్ళడం యిష్టపడకపోయినా ససేమిరా రావాలన్నారు ఆయన. భార్యగదా, మా అక్కకు తప్పలేదు షికారుకు వెళ్ళడం. యిద్దరూ వేలూ వేలూ పట్టుకొని నడవబోయారు. మా బావగారు సినిమాలో ఏదో నటిస్తున్నట్లే నడవసాగారు. అయితే సోమగుండం ఒడ్డుమీద నుంచి నడుస్తూంటే, గుడిసెలు. యిళ్ళల్లోని పల్లెటూరు జనం చోద్యంగా చూసేరు. నేను కూడా నాన్నగారి సైకిలు తీసుకొని దూర దూరంగా వారి వెనుక వెళ్ళాను. ఎందుకంటే ఏ స్థితిలో మా బావగారికి ఎటువంటి కోపం వచ్చి మధ్యలో మా అక్కను వది

తేసి వస్తాడో అని. కోటిపల్లి గోదావరి ఒడ్డుమీద నేను సైకిలు ఎక్కిపోతూంటే, "హల్లో బ్రదరిన్‌లా" అని ఇంగ్లీషు సంబోధనలో పాశ్చాత్య వాతావరణం ఆయన సృష్టించబోయారు. "కమాన్-కమాన్ డియర్" అని ఆంగ్లంలో దొరగారిలా పిలిచారు నాకు లోలోపల చచ్చేంత నవ్వు వచ్చినా ఆపుకుని, పైకి నవ్వితే ఆ ప్రణయ విహారం బెడిసి కొట్టగలదని, నా నవ్వు తగ్గించుకుని దూరదూరంగా వెనకా-ముందూ వెళ్ళాను నా సైకిలుమీద. చీకటిపడ్డాక సవ్యంగా భార్యాభర్తలు ఇంటికి వచ్చాక అందరికీ మనస్సు స్థిమితపడింది ఆ రోజుల్లో పూర్తిగా పాశ్చాత్య నాగరికత పల్లెటూళ్ళలో పెరగని రోజుల్లో ఆ వ్యామోహంతో అనేకమంది యువకులు ముందుకు సాగిపోయేవారు. అటువంటి కోవకు ఒక మచ్చుతునక మా బావగారు.

## గారెల నోము

మా అమ్మ అనేక నోములు నోచుకునేవారు పళ్ళు దానధర్మాలు చేస్తుంటే అవి నాకు ఋషం కనుక ఆ నోములు నాకు చేసుకోకూడదా అని అడిగేవాడిని సరదాగా కోటిపల్లిలో వుండగా మా అమ్మ గారెల నోము చేసుకున్నారు. అది నందికేశుని వ్రతము. అందువలన చేసినగారె

లన్నీ పారెయ్యకుండా ఎవరో ఒకరు తినకపోతే వ్రతఫలం లభించదట—

అయితే అర్ధరాత్రి అడపడుచు గారికి మా అమ్మ ఆదేశం యిచ్చేరు మినపప్పు నానేయమని. ఆవిడకు కొంచెం చెముడు కావడం వలన మా అమ్మ చెప్పిన మేరకు కాక రెట్టింపు పప్పు నానబోసింది. తెల్లవారేక నానిన పప్పు చూసుకుని మా అమ్మకు గంగవెర్రులెత్తాయి. ఇంత పప్పు గారెలు చేస్తే తినేవారు దొరకొద్దూ అని ఆమె బాధపడి నారు. అయినా తప్పలేదు. ప్రొద్దుటి నుంచి చేస్తే రెండో మూడో గంగాళాల గారెలు తయారయ్యాయి. అవి తిన డానికి పేరంటాలకు బ్రాహ్మణులకు కబురు పంపినారు మా అమ్మ. వచ్చినవారు వస్తున్నారు అంటున్నారు, కాని గారెల సంఖ్య ఎక్కువ తరగలేదు. సాయంత్రమయింది. ఇంకా ఒక గంగాళము గారెలు మిగిలిపోయాయి. మా అమ్మకు గాభరా పెరిగిపోయింది యీవేళ వ్రతభంగమై పోతుం దేమో అని బాధ పడుతోంది. సాయంత్రం ఆఫీసు నుండి మా నాన్న రాగానే మా అమ్మ ప్రాధేయపడింది పదిమంది బ్రాహ్మలను ఎవరినయినా పంపమని.

ఆయన విసుగు ప్రకటించారు. యీ నోములు గీములు చేసి మా అమ్మ నానా హింస పెడుతున్నట్లు — చివ రకు "వరేలే" అన్నారు. కాని మరోగంటలో ఒక్క బ్రాహ్మడే వచ్చాడు మా నాన్నగారు పంపారని. మా అమ్మకు చిరాకు పెరిగిపోయింది. చెప్పకున్నా వినని భర్తల్ని

ఏంచేయాలి అని—చివరకు ఆవిడకు కంగారెక్కువయి. బ్రాహ్మలయినా కాకపోయినా సరే, ప్రక్క యిండ్లలో ఎవరెవరున్నారో వారందరిని రమ్మని మా అక్క ద్వారా పిలుపు పంపింది.

మా అమ్మ—ఈలోగా వచ్చిన బ్రాహ్మణుని కూర్చోమని నాల్గు గారెలు వడ్డించిందామె. ఆ బ్రాహ్మడు సుష్టుగా నాలుగు తినేశాడు. మరి నాలుగు వడ్డించారు మా అమ్మ అవీ తినేశాడు మరి నాలుగు వడ్డించింది మా అమ్మ మీరు వడ్డించడంలో మొహమాట పడొద్దు అన్నాడు బ్రాహ్మణుడు అంతే మా అమ్మ వేయడం ఆ బ్రాహ్మణుడు తినడం. మొత్తం గంగాళం గారెలు ఖాళీ చేసేశాడు. ఇంకా కావాలని మారాడు– కాని ఏంచేస్తుంది. ఇంటిలో లడ్డూలున్నాయి పెట్టమన్నారా అంది మా అమ్మ. ఆ బ్రాహ్మణుడు నవ్వి హాయిగా త్రేన్చి ఒక కలశం మజ్జిగ త్రాగి ఠీవిగా ఎడిచి వెళ్ళిపోయాడు. "హమ్మయ్య" ప్రతిఫలం దక్కింది అనుకుంది అమ్మ. కాని ఇంతలో మా అక్క వాళ్ళు పిలవడానికి వెళ్ళగా పిలుపు అందుకున్న ఒక ఇరవైమంది అబలబ ఇంటిలోనికి జొరబడ్డారు. మరి వారికి గారెలు ఏవి? మా అమ్మకు మతిపోయింది. వారందరికీ క్షమాపణ చెప్పుకొని తక్షణం పులిహోర గబగబా చేసి అందరికి పెట్టి పంపించింది మా అమ్మ. పులిహోర పాకంలో మా అమ్మ చాలా నిపుణురాలు, అది తిని సంతోషంగా ఇరుగు పొరుగు అమ్మలక్కలు విశ్రమించారు,

## వాతావరణం

కోటిపల్లిలో నేను చాలాకాలం ఉండలేదు. మా వాళ్ళు అక్కడవున్నారు కాని నేను చదువులకు కాకినాడలో ఎక్కువగా ఉండేవాడిని. కోటిపల్లి వాతావరణం యిప్పటికి సినిదృశ్యంలా గోచరిస్తుంది ఊరి మధ్య సోమగుండం, ఊరి చివర కాల్వ, గోదావరి గాలులు ఊరి పొలిమేర దగ్గర బజారు బస్సుస్టాండు ఎర్రకంకర దుమ్ముతో కూడిన రోడ్డు— ఇవి ఆ పూర్వ ఎల్లలుగా బాగా గుర్తు. సోమేశ్వరాలయం నాకు ఎంతో ప్రీతి కలిగించేది. వీలు వున్నప్పుడు అక్కడకే పోయి ఒంటరిగా కూర్చునేవాడిని. గుడిగంటలు ధ్వజస్తంభం, గర్భాలయంలోని విగ్రహాలు, గుడిగోపురాలు నన్ను వివశుడ్ని చేసేవి. ఆ ఆలయం వాతావరణంలోని ఏదో పవిత్రత నన్ను స్పందింప చేసేది.

## అప్పుల బాధ

మా నాన్నగారు కోటిపల్లికి వచ్చినాక ఆయన ఆర్థికదుస్థితి పరాకాష్టకు వచ్చింది. పేకాట ద్వారా వున్న ఆస్తి అంతా పోగొట్టుకున్నారు. అనవసర వ్యాజ్యాల ద్వారా కోర్టుల చుట్టూ తిరిగి బతుకులో బాధలు కొని తెచ్చుకున్నారు. ఫలించని ఆలమూరు రాజకీయములలో తలదూర్చి శ్రీ నరసింహా

దేవర సత్యనారాయణ గారల వంటి వారితో తగాదా తెచ్చుకొని ఉన్న ఊరు నుంచి బదిలీ అయ్యారు. బ్యాంకుకు తనఖా పెట్టిన అప్పు తీర్చలేక ఆస్తి బ్యాంకుకు వ్రాసి యిచ్చేశారు ఉద్యోగంలో ఏవో తగాదాలు పెరగగా ఆయన్ను సస్పెండు చేశారు. అంతటితో ఆయన శూన్య మైన ఆర్థిక పరిస్థితి స్పష్టంగా కళ్ళముందు గోచరించింది. అప్పటికే ఏడుగురు పిల్లలు, భార్య వున్న మా నాన్న వారిని ఎలా పోషించాలి అనే బెంగలో చిక్కుకున్నారు. మూడు నాలుగురోజులు భోజనంకూడా సరిగా తినక యింట్లో బాధ పడుతూ పడుకున్నారు. తర్వాత ఓనాడు రాత్రి ఎవరికీ చెప్పకుండా రైలుఎక్కి తూర్పువైపు వెళ్ళిపోయారు.

ఇంతలో రెండురోజులు వరుసగా మా నాన్న ఊరిలో కనిపించకపోయేసరికి మా అమ్మకు బెంగ పెరిగింది బంధువు లందరికీ ఉత్తరాలు వ్రాసింది. తక్షణం మా పెద్దమ్మ ఆదిలక్ష్మి, పెదనాన్న కేశవరావు వెళ్ళి మా అమ్మను కలిసి వచ్చారు నన్ను కోటిపల్లికి తీసుకు వచ్చినట్లు జ్ఞాపకం. ఏమైనా ఆయనజాడ నాలుగురోజులనుండి తెలియటం లేదని మా అమ్మ విలపించింది. ఆయన్ను ఉద్యోగం నుంచి సస్పెండు చేశారని ఊరిలో వార్త పాక్కింది. ఇదంతా విన్న మా బంధువులు ముక్కుమీద వేలు వేసుకున్నారు. ఒకవేళ ఆయన పూర్తిగా ఎక్కడికైనా లేచిపోతే ఈ కుటుంబాన్ని ఎవరు పోషించగలరు. అనే సమస్యతో వారు సతమతమైపోయారు. మా అమ్మను పరామర్శించి, బంధు వులు ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. కాకినాడలో

కూడా యీ వార్త బాగా వ్యాపించిపోయింది. నేను కనిపించినపుడు వీళ్ళ నాన్న లేచిపోయాడు. అని అందరు చెవులు కొరుక్కోనడం నాకు ఎంతో బాధ అనిపించింది. అదేసమయంలో మా అమ్మశోకం గుర్తుకొచ్చేటప్పటికి నేను ఏడ్పు ఆపుకోలేక ఒంటరిగా ఏకాంతంగా ఏడుస్తూ కూర్చునేవాడిని.

ఒక వారంరోజులు గడిచాక విజయనగరంలో ఉంటున్న మా రామమూర్తి మామయ్య వద్దనుంచి ఒకఉత్తరం వచ్చింది. మానాన్న కనిపించాడని త్వరలో తిరిగి కోటిపల్లి వస్తాడని ఆనాటి నా ఆనందానికి అవధులు లేవు. మా నాన్న లేచిపోయినపుడు నన్ను చిన్నగా చూసి జాలిచూపే వారిపై నాకు విజయగర్వము కలిగింది.

మా నాన్న సరాసరి విజయనగరం వెళ్ళిపోయారట. ఈ అప్పులబాధ ఉద్యోగము లేమివలన సంసారం వదలి సన్యాసి అయిపోవాలని పారిపోయారట. కాని విజయనగరంలో బర్మాషెల్ సూపరిండెంటుగా వుంటున్న మా రామమూర్తి మామయ్య అంటే మా నాన్నకు ప్రాణం. ఆకరిసారిగా అతన్ని చూసి వెళ్ళాలని విజయనగరం వెళ్ళారట మా నాన్న. హఠాత్తుగా వచ్చిన మానాన్న రాకచూసిన మా మామయ్య ఆశ్చర్యపోయినా మా నాన్న మనో రహస్యం అంతుచిక్కనివ్వలేదుట సరదాగా యిద్దరు కలసి సినిమాలు చూసి రెండురోజులు గడిపారు. తరువాత ఒకనాటి ఉదయం చెప్పకుండా నిష్క్రమించారు.

తరువాత ఎక్కడో జయపూరు ప్రాంతాలలో తిరిగి ఏదో హోటలులో వుంటూ మొక్కజొన్న పొత్తులు అరటిపండ్లు వంటి స్వాత్వికాహారం అలవాటు చేసుకుంటూ సన్యాసి అవడానికి ప్రయత్నాలు చేసారుట. కాని చేతిలో ఉన్న డబ్బయిపోగానే డబ్బులేకుండ ఎలా సన్యాసి కాగలను. అదే భయం కల్గి తక్షణం ఒక కార్డు వ్రాసి మామయ్యను డబ్బు పంపమని వ్రాశారుట మా నాన్న.

ఈలోగా కాకినాడ కోటిపల్లినుంచి మా నాన్న పలాయనం గురించి విన్న మామయ్య అసలు కథ అర్థము చేసుకుని తనకు నమ్మిన స్నేహితున్ని జయపూర్ హోటలుకు ఎలాగైనా మా నాన్నను ఒప్పించి తీసుకురమ్మని పంపారుట. ఆయన విజయవంతముగా మా నాన్న తిరోగమనము రూపొందించినారు.

తిరిగి వచ్చిన మా నాన్ననుచూసి మా మామయ్య అనవలసిన మాటలన్నీ అని కేకలువేసి బుజ్జగించి ఎన్నో సినిమాలు చూపించి గీతాపారాయణం చేసి మా నాన్న నిస్పృహ తొలగించి ప్రతినెలా తాను డబ్బుపంపి అప్పులు తీరుస్తానని అభయహస్తమిచ్చి మా నాన్నను సవ్యంగా తీర్చిదిద్ది కోటిపల్లికి గృహోన్ముఖుడయ్యేలా చూశాడు మా మామయ్య.

విజయనగరం నుంచి మధ్యాహ్నం రెండున్నర గంటలకు మా నాన్నగారు కాకినాటలో రైలు దిగారు. పంచ చొక్కా పైన కప్పుకున్న ఉత్తరీయంతో రైలుదిగాటు

ఎదురుగా నేను మా పెదనాన్న కేశవరావుగారు ఆయన్ను కలుసుకున్నాం. ముఖం చెల్లక వినమ్రవదనుడై నాడు కాసేపు. మా పెదనాన్నగారు మా నాన్నను పలకరించి ధైర్యం చెప్పాడు. నన్ను మా నాన్న తనదగ్గరకు తీసుకుని ఆలింగనం చేసుకున్న రీతిలో తలనిమిరారు కనుల వెంట అయనకు కన్నీరు కారింది-ఆదృశ్యం నాకు చాలా బాధాకరంగా మారి కనులు చెమ్మగిల్లాయి.

తిరిగి కాకినాడ నుంచి రైలు కదిలింది. దారిలో ఒకటి రెండు సారులు అమ్మ గురించి అడిగారు. సాయంత్రానికి కోటిపల్లి చేరుకున్నాం-ఇంటిలో అడుగు పెట్టగానే నాన్న వచ్చాడమ్మా' అంటూ గబగబా పరిగెత్తాను మా తమ్ముడు చెల్లెలు చుట్టుముట్టి లక్ష ప్రశ్నలు వేశారు. మా అమ్మ ఆనందముతో గతించిన బాధతో అవాక్కయి కన్నీటి భాష్పాలు రాలుస్తూ ఒక్కక్షణం నిశ్చేష్టితురాలయింది. అది గమనించారు మా నాన్న. ఎక్కువ మాట్లాడలేదు తక్షణం మనోక్లేశం ఉపశమించాక మా నాన్న తన పలాయన గాథ వివరించారు మా అమ్మకు మధ్యలో చలోక్తులు- ఆయన నవ్వులు ఆ రాత్రి కమ్మని భోజనం- విడి దూరమై కలసిన మా అమ్మ. నాన్నకు అనాటి ఆనందం వర్ణనాతీతం.

## పట్నవాస మకాం

కోటిపల్లిలో మా మకాం చాలా కాలం వుండే పరిస్థితి కలుగలేదు. కాలక్రమంలో మా నాన్న సస్పెన్షన్ నుంచి విముక్తులయి తిరిగి ఉద్యోగంలో చేరారు. ఆనాడు శ్రీ నరసింహదేవర సత్యనారాయణ మా నాన్న మధ్యవున్న విభేదాలు కథలుగా చెప్పుకునేవారు. మా నాన్న ఆ ప్రాతంలోని స్థానిక రాజకీయాలలో చోటా నాయకుడిగా ప్రవర్తించడంవల్ల, ఆయనకు హాని ఎక్కువ జరిగింది. కాని రాజకీయాలవల్ల లాభం కలగలేదు. ఈ లక్షణాలు కొంత వరకు నా జీవితంలోనూ ఈనాడు కనిపిస్తోంది. రెండుసార్లు 1966లోను 1972లోను హైదరాబాదు జిల్లా పట్టభద్రుల నియోజకవర్గంనుంచి యం. యల్. సి. ఎన్నికలలో ఓడిపోవడంవలన, మిత్రులుగా కనిపించేవారు శత్రువులుగా ఎలా ప్రవర్తిస్తారో అర్థం చేసుకుని, జీవితగమనంలో అడుగడుగుకూ స్వీయచర్యలు ఆత్మవిమర్శ చేసుకుంటూ పురోగమించే విజ్ఞానం కొంత పొందగలిగాను. రాజకీయ జీవిత అనుభవం కాలక్రమంలో జీవితవికాసానికి వాడుకుంటే మనిషికి మానసిక పరిపక్వత లభిస్తుంది. ప్రతికోణంలో యీనాటి సమాజంలో దేశంలోని అన్నిరంగాలలో రాజకీయాలు ఒక అంతర్లీనమైన లక్షణం. ఇవి అర్థం చేసుకుని వ్యక్తి జాగ్రత్తగా పురోగమించాలి. యీ సంక్లిష్ట సమాజంలో కోటిపల్లిలో నాకేకాకుండా, నా తమ్ముడూ చెల్లెలికీ

చదువు ఎక్కువతరగతుల కళాశాల అక్కడ లేనందున కాకినాడలోనే కాపురంపెడితే బాగుంటుందని మా నాన్న నిర్ణయించారు. తాను కోటిపల్లిలో ఉద్యోగం చేస్తున్నా కాకినాడకు సెలవులకు వచ్చిపోవచ్చు అని మానాన్న అభిప్రాయం. తదనుగుణంగా మాకు బాధువులైన ఆదిలక్ష్మి దొడ్డమ్మ, కేశవరావు పెదనాన్న, గార్లతో సంప్రదించగా వారు శ్రమపడి కాకినాడ గురజాడవారి యింట్లో దొడ్డివైపు భాగంలో ఒకభాగం అద్దెకు ఏర్పరచారు మాకు. సామానంతా ఎడ్లబండిపై ఎక్కించి మేమంతా ఎడ్లబండి చివర కూర్చుని రాత్రిఅంతా ప్రయాణం చేసి మర్నాడు ఉదయం పదిగంటలకు కాకినాడ చేరుకున్నాం. అంత సామాను బండిలో చేరవేయడం నాకు యిష్టంవుండేదికాదు. చేట, చీపురు, కట్టెలు, బొగ్గులు చెత్తసామాను సొట్టగిన్నెలు, చిల్లిచెంబులు సమస్తం గోనెసంచుల్లో చేర్చి మాతో రవాణా అయ్యేవి. ఇన్ని సామానులు లేకపోతే సంసారం సాగదా అనే అనుమానం నాకు కలిగేది. పాతసామానులు ఎవరికయినా యిచ్చేయవచ్చు. పనికిరాకపోతే పారేయవచ్చు - కాని ఆపని చేయక, అవన్నీ నిర్మాల్యాలుగా యింట్లో కనిపించడం చిత్రంగా వుండేది. పెద్దపెద్ద పట్టెమంచాలు బండిటావు మీద వేసి కట్టేసేవారు. ఇలా బండి సామానులలో నిండి నడుస్తుంటే దేశదిమ్మరులయిన బికారు కుటుంబాలకు మాకు తేడా కనిపించేదికాదు. ఇలా చాలామంది ప్రభుత్వోద్యోగులు ఒక వూరునుంచి మరోవూరు బదిలీ అయిపోతుంటే యీ సామాను బదిలీ నన్ను విచిత్రంగా ఆకర్షించేది. మరి

తెలుగువారికి తమిళంవారికి ఈ విషయంలో వున్న వ్యత్యా
సం నాకు నచ్చింది - తమిళులు సామాను చాలా తక్కువగా
వుంచుకుని, భృతికై ఎక్కడికయినా అతిసునాయాసంగా
పోగలవారు - అలా తేలికగా ప్రయాణం చేయడం
అన్న ఆసక్తి ఆనాటినుంచే నాలో నాటుకుపోయింది.

కాకినాడలో గురజాడ వారి దొడ్డిలో మాకు దొరి
కిన ఒకగది వంటిల్లు. గదిముందు చిన్న ఓపెన్ వరండా,
వంటిల్లు నానుకుని అరటివృక్షాలతో వున్న చిన్న పెరడు.
ఇల్లు చిన్నదయినా అద్దె సబబుగా, వాటా సొంపుగా వుం
డేది. మానాన్న కోటిపల్లినుంచి ప్రతి శని ఆదివారాలలో
పండగల్లో యిక్కడకు వస్తుండే వారు. కాకినాడలో వుండ
గా నేను పి ఆర్ కాలేజిహైస్కూలులోను మా తమ్ముడు
కూడా మాతో మరో క్లాసులోను చదివేవారం. ఉన్న జీతం
తోనే ఎలాగైనా కష్టపడి పిల్లలకు పెద్దచదువులు చెప్పిం
చాలనే తపాతపా మా తల్లిదండ్రులలో పెరిగిపోయింది.
ఇరవై ఎకరాల సుక్షేత్రమైన మాగాణి భూమి దత్తపుత్రు
డుగా మానాన్న ధ్వసం చేసిన స్థితికి ఆయన ఎంతో విచా
రించేవారు. మా నాన్నగారి తల్లి మారెమ్మగారి పేర
వున్న తదనంతరము భూమికూడా ఆయన అమ్మేయడం
యింకా విచిత్రంగా వుంది, అందరికీ బాధ కలిగించేది. ఈ
పిల్లల భవిష్యత్తు ఎలా అనే దిగులుతో మా నాన్న మా
అమ్మ తరుచు చర్చించుకుంటూ తర్జన భర్జన పడుతూ,
ఘర్షణలుకూడా జరగడం నేను గమనిస్తూ ఉండేవాడిని.

కాకినాడ పట్టణ వాతావరణం, కోటిపల్లి, ఆలమూరు గ్రామాల వాతావరణానికి భిన్నం. నేను ఇదివరకే కాకినాడ చూసినందునా, నాకు పట్టణవాతావరణం కొంత అర్థమయింది అద్దెకొంపల్లో ఇరుకుప్రాంతాల్లో విలాసాల అలవాట్లతో సినిమాల మోజుల్లో పట్టణవాతావరణం కొంత ఖర్చు చేయించేది. కాని ఆ ఖర్చుకు స్తోమతు స్థాయిలేని కుటుంబం మాది. అందువలన తరుచు అనేక అవసరాలకై ఆర్థిక సంఘర్షణతో మేము సతమతమవుతూండడం నాకు జ్ఞాపకం.

కాకినాడ పట్టణ వాతావరణం నాలో కలిగించిన ఒక మంచి లక్షణం వీలయినప్పుడల్లా గ్రంథాలయాలలో కూర్చుని పుస్తకాలు చదువుకోడం. దానివలన అనేక పత్రికలు చిత్రగుప్త ఢంకా, రూపవాణి ఆనందవాణి, జ్యోతి, భారతి మున్నగు పత్రికలు ఆ రోజుల్లో ఎక్కువగా చదివే వాడిని. కొవ్వలి జంపన విపరీతంగా ఆ రోజుల్లో నవలలు వ్రాసేవారు కొవ్వలి నవలల్లో సాంఘిక శృంగారం జంపన నవలల్లో ఆధునిక వాతావరణంలోని శృంగారం తొణికిస లాడుతూండేవి. యువతరం ఆ రోజుల్లో వీరి నవలలు విశృంఖలంగా చదువుతుండేవారు పెద్దలు యీ నవలలు చదవ కూడదని మాకు నిషేధం విధించేవారు. అయితే మా తల్లి తండ్రులు పడుకునే దాకా మేము పాఠ్యపుస్తకాలు చదువు తున్నట్లు నటిస్తూ. వారు నిద్రపోగానే రాత్రి పది గంటలు దాటాక పాఠ్య పుస్తకాల మధ్య కొవ్వలినవలలు పెట్టుకొని

రాత్రంతా చదువు తూండేవాడిని. అర్ధరాత్రి మెలకువ వచ్చి మా అమ్మ లేచి చూస్తే గబుక్కున కస్వాలినవల దాచేసి పాఠ్యపుస్తకం చదువుతున్నట్లు నటించేవాడిని ఆరోగ్యం పాడైపోతుంది రాత్రి ఎక్కువ మేలుకోవద్దని మా అమ్మ వారింపు. పైగా కిరసనాయిలు ఆరికేన్ దీపాలవల్ల ఖర్చు పెరుగుతుంది. పగలు చదువుకోమని ఆమె సలహా. అటు వంటి బీద వాతావరణంలో ఏదో చదవాలి, నేర్చుకోవాలి అనే ఆసక్తితో సాహిత్యం మీద అభిరుచి నాకూడా పెరిగింది.

నాజీవితంలో పట్నవాసం మకాం కొంత జ్ఞానజ్యోతి తెరుచుకొనడానికి నాకు ఉపక్రమించింది. పి. ఆర్. కాలేజి హైస్కూలులో చదువులు, అనేక మంది పట్నవాసపు ధనికుల బిడ్డల సాంగత్యత పరిశీలన నాలో ఏవో క్రొత్త కోరికలు, క్రొత్త ఆశలు ఉదయింపచేసేవి కాలేజిస్కూలులో నాకు బాగా జ్ఞాపకమున్న మాస్టారు అన్నంగి సూర్య నారాయణగారు ఆయన ఇంగ్లీషు చెప్పేవారు— క్లాసులో మొదట నన్ను చూసినపుడు కేశవరావుగారికి మరదలు బిడ్డవా? అని నన్ను పలకరించారు. ఆ సంభాషణతో క్లాసు పిల్లల మధ్య నాకు గౌరవమూ, అన్నంగి మాస్టారుతో సాన్నిహిత్యం నెలకున్నాయి వారి ఇంగ్లీషు పాఠాలంటే చెవికోసుకునే వాడిని. అదే విధంగా ఇతర పాఠాలమీద కూడా ద్యాస ఎక్కువ వున్నా, వారు నా మనో ఫలకం మీద ఎక్కువ ప్రభావం చూపలేక పోయారు. ఆ హైస్కూలులో

మూడవ ఫారం, నాల్గవ ఫారం మాత్రం చదివాను. నాల్గవ ఫారం చదివే రోజుల్లో నాకు ఒక మిత్రుడు వుండే వాడు నేనంటే బాగా అభిమానించేవాడు నాతోటి స్కూలుకి వస్తూ, వెడుతుండేవాడు తరుచు ఒక రోజు మధ్యాహ్నం భోజనంచేసి నేను హైస్కూలుకు త్వర త్వరగా వచ్చేశాను. అవి పరీక్షలు త్వరలో వస్తున్నకాలం. అందువల్ల క్లాసులో ఇతర విద్యార్థులులేని సమయం కనుక పుస్తకాలు తీసి ధ్యానంతో చదువుకుంటున్నాను. పదిమందిచేత మంచి విద్యార్థి అనిపించుకోవాలని తహతహలాడే వాడిని. ఆ సమయంలో నాతోటి విద్యార్థి స్నేహితుడు గబుక్కున వెనక నుంచి వచ్చి తన పుస్తకాల దొంతరతో హాస్యంగా ధన్ మని నా వీపుమీద గట్టిగా చరిచాడు చాలా ధ్యానంలో వున్నానేమో, ఆ చప్పుడుదెబ్బకు ఉలిక్కిపడి కంగారుపడ్డాను - విపరీతమైన కోపం వచ్చింది.

తక్షణం అతని చెంప చెళ్ళుమనేలా లెంపకాయ వేశాను. ఆ స్నేహితుడు ఆశ్చర్యపోయాడు, కొట్లాడబోయాడు. ఇంతలో ఇతర విద్యార్థులు వచ్చి మమ్మల్ని విడిపించారు. క్లాసు పూర్తయి సాయంత్రం ఇంటికి వచ్చేస్తూంటే నా వెనకాల నా స్నేహితుడు నంగి నంగిగా నక్కుతూ వస్తున్నాడు. తరువాత మెల్లిగా నన్ను చేరి ఏరా దెబ్బతగిలిందా ఏమనుకోకు సారీ-సరదాగా నిన్ను ఉలిక్కి పడేలా చేయాలనుకున్నాను అన్నాడు - నాకు అతనిమీద ఆత్మీయత కలిగి-అనవసరంగా అతన్ని లెంపకాయ కొట్టానని బాధ పడ్డాను, అంతే ఇద్దరం కలిసిపోయాం. అయితే

మా స్నేహం తాత్కాలిక మయిపోయింది. అందువలన ఇప్పుడు అతని పేరు అడిగితే జ్ఞప్తి లేదు. అతను ఒక పెద్ద వైశ్యకుటుంబంలోనివాడు. ముఖంమీద మచ్చలుండేవి. తరువాత ఎప్పుడో అతన్ని చూశాను.

ఎక్కువ చదువులు లేక వ్యాపారంలో దిగి అన్నగార్లకు సహాయం చేస్తున్నా నన్న జ్ఞాపకం. అంతటితో ఆ బంధం కాలప్రవాహంలో తెగిపోయింది.

కాకినాడలో నేను మర్చిపోలేని సంఘటన మరొకటి వుంది. మా పి. ఆర్. స్కూలుకు వెళ్ళేదారిలో చెరువు వద్ద సత్యనారాయణ స్వామి కోవెల వుంది. పాలరాతి విగ్రహాలు కల ఆ దేవుని బొమ్మలు నన్ను ఆకర్షించేవి. సాయంత్రం సాధారణంగా ఆ కోవెలకు వెళ్ళని రోజులేదు. కోవెలలో దేవునిదర్శించి వెనకాల కాంపౌండులో అమ్మవారిని దర్శించి, చెట్ల మీద కూతల సరాగాలు ఆనందించి, తన్మయ భక్తితో. కుంకునామంగా తీర్చిదిద్దుకొని ఇంటికి వెళ్ళే వాడిని పరీక్షలు ప్యాసయితే, కొబ్బరికాయలు కొడతానని ఆ సత్యనారాయణ దేవునికి మొక్కుకునేవాడిని. ఆ పవిత్ర దేవాలయ ప్రాంగణం నాలోఏదో శక్తి,మనశ్శాంతి. ధైర్యంకలిగించేవి. జీవితంలో మానసిక సంఘర్షణలు బాధలు పెల్లుబికినపుడు ఆ కోవెల దేవుడిని తల్చుకొనే వాడిని అక్కడికి పోయి ప్రశాంతంగా కూర్చునేవాడిని.

ఆ కోవెల నామదిలో ఒక కాంతి కోవెలగా ఈ నాటికీ నిలిచిపోయింది. అక్కడ మొక్కువ మార్వాడీ వాతావరణ

మున్నా. ఆవిశాలప్రాంగణం నాకు శాంతి నిలయంగా భావించింది. ఈ అవకాశం తరువాత నేను నాలుగు సంవత్సరాలు పట్టభద్రుడిగా చదువుకున్నపుడు కూడా నాకు లభించి ఆ కోవెల తరచు దర్శించేవాడిని.

వయస్సు చిన్నదైనా ఇంటికి పెద్దకొడుకును కనుక యింటి వ్యవహారాలన్నీ మా అమ్మగారు చెప్పినట్లుచేసే వాడిని ఇంటికి కూరలు తేవడం, ఇతర సరుకులు తేవడం క్రమంగా మా అమ్మగారు నాకు నేర్పింది. ముఖ్యంగా సంతకుపోయి కూరగాయల బేరంచేసి తేవడంనాకు చాలా సరదాగా వుండేది. నవనవ లాడే లేత కూరగాయలు చూస్తుంటే ఏదో ప్రకృతి ఎదురుగా తాండవిస్తున్నట్లు అనిపించేది. ఆనాటి నుంచి ఈనాటివరకూ సమయం చిక్కాలేకాని కూరగాయలు కొనడం నాకు ఒక సరదా.

ఒక రోజు మా అమ్మగారు నాకు నెల స్కూలు ఫీజు ఇచ్చింది. మూడవ ఫారానికి రెండు రూపాయల ముప్పావలా స్కూలు ఫీజు ఆరోజుల్లో. రెండురూపాయల నాణాలు చిల్లరి జేబులో వేసుకుని ఆ వీధిలోకి బయలుదేరాను. కాకినాడలో రామకృష్ణలంచ్ హోం ఎదురుగా ఒక మసీదువద్ద ఒక లాటరీవాడు అరుస్తున్నాడు డబ్బాలో ఏవో పాచికలున్నాయి. ఎదురుగా వివిధ బొమ్మలు వుండేవి. రూపాయికి రూపాయి. అని అరిచాడు, అక్కడికి వెళ్ళిచూశాను. చోద్యముగా కొందరికి పావలాకు పావలా రావడం నాకళ్ళారా చూశాను, ఇంకేం అలాగే నాకూ అదృష్టం పట్టకూడదా. అని సాహసించి ఒక

రూపాయి కాశాను. మరో రూపాయి వస్తుందనే ఆశతో. కాని నా దురదృష్టం, రూపాయి పోయింది. నా కళ్ళు గిర్రున తిరిగాయి. ఆ రూపాయి స్కూలు జీతం ఎలా కట్టాలి? బాధపడిపోయాను. పరవాలేదబ్బాయిగారు! ఈ సారి మళ్ళీ కాయండి. మీ రూపాయి మీకు వచ్చేస్తుంది అన్నాడు. ఆశపడి మరొక రూపాయి లాటరీలో కాశాను. ఆ రూపాయి కూడా పోయింది. నాకు గాభరా పెరిగిపోయింది. గుండె దడ దడలాడింది భయంతో. ఒక వారం రోజులు ఆ సంఘటన మా అమ్మతో చెప్పలేదు. తరువాత స్కూలుఫీజు కట్టిన రశీదు ఏదిరా అని నిలదీసి మా అమ్మ అడిగితే తెల్లమొహం వేశాను. ఎవరో స్నేహితుడు వెంట పరిగెత్తుకొంటూ వస్తూంటే నేను పరుగెత్తాను. ఆ పరుగులో గాలికి జేబులోని రూపాయి కాగితాలు ఎగిపోయాయి అని బొంకాను. నీకిచ్చినవి రూపాయి బిళ్ళలు కదుట్రా! అని అమ్మ నిలదీసి అడిగింది. చివరకు పట్టుబడ్డాను. జరిగిన లాటరీ కథ చెప్పక తప్పలేదు. నాలుగు చివాట్లు తిన్నాను, చివరకు మళ్ళీ మా నాన్నను అడిగి అమ్మ స్కూలుజీతం ఇచ్చింది అది కట్టాను, అలాంటి ఈ గొడవ ఈ నాటికీ మర్చి పోలేను. ఎక్కడైనా లాటరీలో పాల్గొనాలంటే నా కటువంటి అదృష్ట జాతకం కాదనిపిస్తుంది సరదాగా లాటరీలోనైనా డబ్బు ఖర్చుపెట్టినా ఫలితం శూన్యమే. అందువల్ల వాటి జోలికి వెళ్ళకూడదని నేను నిర్ణయించుకున్నాను నా ఆర్థిక దుస్థితి కూడా చాలా కాలం నన్ను అటువంటి వాటికి దూరంగానే వుంచింది.

కాకినాడ హైస్కూలులో చదువుకునే రోజుల్లో నాకు స్నేహితులు ఎక్కువ మంది ఉన్నట్లు గుర్తు లేదు. మా రెండవ దొడ్డమ్మ కొడుకు చిట్టిబాబు అంటే నాకు చాలా మైత్రి ఏర్పడింది. పట్నవాసంలో అడుగు పెట్టిన నాకు స్నేహితుడిగా పట్నవాసం గైడుగా చిట్టిబాబు వుండేవాడు. తనతోటి మిత్రులను ఎందరినో పరిచయం చేశాడు కాని సాహిత్యం పెంపొందిప చేసుకునే ధైర్యం నాకుండేదికాదు. పది మందిలో దూసుకొని కలసి మసిలే లక్షణం నాలో చిన్నతనంలో మృగ్యం. అందువలన తీరుబడి వున్నవుడు ఎక్కువగా మిత్రుడుగా చిట్టిబాబు నాతో వుండేవాడు.

మేము కాపరమున్న గురజాడ వారింట్లో వారి అబ్బాయి కేశవ రావుతో నాకు పరిచయం ఏర్పడింది. తరువాత చాలా సాన్నిహిత్యం కూడా ఉండేది. ఆ రోజుల్లో చదువుకు, గ్రంథాలయ పఠనానికి అతనితో కూడా సాంగత్యం నేను పొందగలిగే వాడిని.

మా పెద్ద దొడ్డమ్మ మహాలక్ష్మిగారు కాకినాడలో శ్రీపాదవారింట్లో ఉండేవారు శ్రీపాదశేద జోగారావు, చిన జోగారావులతో పరిచయం వుండేది. వారు శ్రీమంతులు. అయినా మా పెద్దమ్మ కుటుంబంతో స్నేహంగా ఉండే

వారు. అలాగే నన్నుకూడా ఆ కుటుంబం అభిమానంగానే చూసేవారు. మా మహాలక్ష్మి దొడ్డమ్మ మనమడు కళా వెంకటరమణ బాబ్జి అని అందరూ ముద్దుగా పిలిచేవారు అతనితో నాకు మైత్రి పెరిగింది.

కాకినాడలో మా పెద్ద దొడ్డమ్మకు మనుమరాలు సక్కుబాయి భర్త యర్రగుంట్ల రామారావు ఆ రోజుల్లో నన్ను ఆకర్షించిన వ్యక్తుల్లో ఒకరు. చాలా ధనికుడని మా వారంతా అనేవారు అతను సూటు వేసుకుని ఠీవిగా సైకిలు మీద చదువుకు వెళ్ళేవాడు అప్పటికే జీవితంలో భోగము అన్నది రుచి చూసిన వ్యక్తి. అతని ఆడంబరం, ఠీవి, మా బంధువు లందరిలో చర్చనీయాంశముగా ఉండేది. అతనిని గౌరవించడంలో అందరూ పందెం వేసుకునేవారు. అతని దృష్టిలో అప్పుడు నేను చాలా చిన్నవాడిని. ఖాతరు చేయ వలసిన వ్యక్తిని గాను. పైగా వయస్సు భేదంవల్ల మైత్రికి ఆస్కారంలేదు. అతనే మర్యాదకు నన్ను అప్పుడప్పుడు పలకరించేవారు.

ఆకెళ్ళవారి సందులో విఠలవారు వుండేవారు. నేను తరుచు మా చిన్న పెద్దమ్మ ఆదిలక్ష్మిగారి యింటికి వెడు తుండేవాడని. విఠలవారి పెద్దమ్మాయిగారి దత్తపుత్రుడు నరసింహామూర్తి-దత్తపుత్రుడు అంటే జల్సారాయుడు. అతని దగ్గర స్నేహితులను రంజింపచేసే ధనం వుంటుందని ప్రతీతివలన, స్నేహితులు చుట్టూ ప్రోగవుతారు అలాగే

నరసింహమూర్తి కూడా. కాని నేనంటే అభిమానంగా వుండేవాడు నరసింహమూర్తి అప్పుడప్పుడు వారింట్లో కబుర్లు చెప్పుకునే సారం కాలక్షేపం చేస్తుండేవారం మా వయస్సు భేధమైనా మా ఆదిలక్ష్మి పెద్దమ్మ అల్లుడు దీక్షితులతో నేను వెంట పట్నంలో తిరుగుతుండేవాడిని. అతను ఆజానుబాహుడై పొడుగైనవాడు, నేను చిన్నవాడిని లారెల్ అండ్-హార్డీ లా వుండేవారం. అతను ఛలోక్తులు విసిరేవాడు వాటిని ఆనందించి నవ్వుతూ అతనివల్ల ఆకర్షింపబడినవాడిని. చదువులో అతను పూజ్యము కాని ప్రపంచజ్ఞానంలో అధికుడు—ఆపైగా రసికతలో నిష్ణాతుడు — ఎంతోమంది యువతులను ఆకర్షింప చేసేలా ప్రవర్తించేవాడు.

మా పెద్దమ్మ ఆదిలక్ష్మి గారింటికి ఎదురుగా తిరుమలరావు కుటుంబం వుండేవారు. డా॥ తిరుమలరావు కాంగ్రెసులో నాయకులు, చక్కని వ్యక్తి. ఆయన చాలా పెద్దవాడని అంతా అనేవారు. తరుచు టౌన్ హాలులో రాజకీయ నాయకులు ఇచ్చే ఉపన్యాసాలు అప్పుడప్పుడు వినేవాడిని ఆయన కుటుంబంలో ఆయన చెల్లెళ్ళు వుండేవారు. చాలా చదువుకున్న వారనీ, ఆధునిక నాగరకతా వ్యామోహంకల వారని వినికిడి. వారితో మాట్లాడడమే అపురూపం అసలు ధైర్యం నాకు ఎప్పుడూ లేదు.

నా జీవితంలో అలాగే ఆకిళ్ళ కృష్ణమూర్తి మా పెద్దమ్మ ఆదిలక్ష్మి మరిది, ఆయనకు కొడుకు ఒక్కడే. అయితే

కొంత కాలానికి అతనికి కుష్టివ్యాధి వచ్చి చనిపోయాడు. ఆ సందులో మురికి కాలువ మధ్య ఇంటిలో యీ కుష్టు రోగం అందరికీ ఏవగింపయినా విచిత్రంగా ఉండేది.

తల్లిదండ్రులు ఆకుష్టిరోగికి చేసినసేవ నాలో విచిత్రమైన భావాలు రేకెత్తించేది. పుత్రవాత్సల్యం అంత గాఢంగా వుంటుందా అనే భావం కలిగేది.

ఆదిలక్ష్మి పెద్దమ్మగారింటి ప్రక్కనే చల్లా సుబ్బారావు గారిఇల్లు వుండేది. వారి ఇంటి పిల్లలతో కొద్దిపరిచయం కలిగింది. కాని నాకు అ వివరాలేవీ గుర్తులేదు పెద్ద ప్లీడరు గారి వంశమని, అందరూ ఆ కుటుంబాన్ని గౌరవించేవారు. మా ఆదిలక్ష్మి పెద్దమ్మకు, చల్లావారి యిల్లాలుకు స్నేహం వున్నట్లు నాకు తెలుస్తుంది.

కాకినాడలో మేమువుండే గురజాడ వారింటికి, పోచిన దొడ్డమ్మ అదిలక్ష్మి గారింటికి మధ్య పైడా వెంకట నారాయణ గారిల్లు వుంది ఆయన పిల్లాజమీందారు ఆయన ఇంటి ముందు కార్లు, రాజకీయాలులో వుండడంవల్ల వచ్చే వెళ్ళే పెద్దవాళ్ళ రాక పోకలు నన్ను ఆకర్షించేవి అదేరీతి జాగ్రి ప్రెస్సుమా దొడ్డమ్మగారి ఇంటిఎదురుగా వుండేది. పుస్తకాలు, ప్రచురణ- మొదలగువిషయాలు లీలగా మనసులో మెదిలేవి. ఆ భావనలే యీ నాడు క్రమంగా నాటుకొని నా జీవితంలో రచన, ప్రచురణ కార్యక్రమాలు పెంపొదింప జేసాయి.

ఎదురుగా లక్కరాజు సుబ్బారావుగారి ఇల్లు వుండేది. వారు ధనికులు. పలుకుబడిగల ప్లీడరు. రాజకీయాలలో ఒక కాలు ఉంచి చైతన్యవంతగా వుంటున్నవారు. వారి జీవితం మధ్య తరగతి జీవితానికి పది రెట్లు మిన్న. వారింపహోదా హంగు నన్ను ఆకర్షించి, అనేక ఆలోచనలు నాలో రేకెత్తించేవి. సామాన్య మధ్య తరగతి కుటుంబీకుడు ఆ స్థాయికి పోవాలంటే ఏం చేయాలి? ఈ అలోచనకు సమాధానాలు జీవితంలో అడుగుపెట్టి దూసును పోవలసిన సమయంలో తెలుస్తోండేవి. మా నాన్న కోటిపల్లిలో వుంటూ తరచు కాకినాడ సెలవలకు వచ్చి, మమ్మలను చూస్తూ మా యోగక్షేమాలు కనుక్కునేవారు.

ఆయనకు కొంతకాలం నుంచి మూలశంఖ వ్యాధి పరాకాష్ట స్థితికి వచ్చింది. సైకిలు మీద వివిధ గ్రామాలకు కోపరేటివ్ ఇన్స్పెక్టరుగా ప్రయాణం చేయడం వల్ల యీ వ్యాధి అంకురించిందనీ, ఇంకా అలా ప్రయాణం చేయడం కష్టంగా ఉండి ఆపరేషను చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. ఆలమూరులో డా॥ చలపతి మా నాన్నకు ఆప్త మిత్రులు ఆయన సలహాపై కాకినాడలో ఆయన తమ్ముడు హరి ఆస్పత్రిలో ఆపరేషన్ చేయించుకోవాలని ఏర్పాట్లు చేసుకున్నారు. హరిగారు మా నాన్నపై ఉన్న గౌరవం వల్ల ఆయనకు ప్రత్యేకంగా ఒక గది ఏర్పాటుచేసి సకల సౌకర్యాలు సమకూర్చారు. మా నాన్నను చూడడానికి మేము, అంటే నేను మా తమ్ముడు చెల్లెలు, పిల్లలం ఆస్పత్రిలో

హడావుడిగా వస్తూ పోతూ గందరగోళం చేస్తున్నా, వారిగారు మా నాన్నపై వున్న గౌరవంతో ఏమీ అనకుండా నవ్వుతూ వుండేవారు. ఒక వారం రోజులు గడిచాయి. ఆపరేషను అయినాక ఆస్పత్రిలోనే మా నాన్నారు భోజనం ఏర్పాటు చేసేది. మా అమ్మగారు పడకమీదే విశ్రాంతి తీసుకోవాలని డా॥ వారి మా నాన్నకు ఆదేశించారు. రోజూ మందులిస్తూ, ఆపరేషన్ చేసినపుండు తగ్గటానికి డా॥ వారి వైద్యం చేస్తుండేవారు.

డా॥ వారిగారి ఆస్పత్రికి సమీపంలోనే చాలా సినిమాథియేటర్లు వున్నాయి. మా నాన్నకు సినిమాలు చూడడం ఒక సరదా. ఆపరేషనయ్యాక పుండు మాని పోతోందిగదా అనే ధీమాతో, ఏమీ తోచడం లేదని, ఇక ఎవరికీ చెప్పకుండా "గాంధీ జీవితం" గురించి సినిమా వస్తే చూడడానికి వెళ్ళారు. మరి మూడు గంటలు ఒక చెక్క బెంచీ మీద కూర్చుని వచ్చారు. తర్వాత ఆయనకు ఆపరేషను చేసిన ప్రాంతంలో మరో పుండు బయలుదేరింది. ఆ పుండును మళ్ళీ ఆపరేషను చేసితీరాలని డా॥ వారిగారు చెప్పారు. తప్పని సరిగా పదిహేను రోజులలోనే అదే శరీర భాగంలో రెండవ ఆపరేషనుజరిగింది. కాని ఆయన పరిస్థితి మెరుగుపడలేదు. పైగా విషమించింది. పృష్ఠభాగంలోని పుండ్లు కుళ్ళి శరీరారోగ్యం చెడిపోయింది. అతి వేగంగా ఆయన స్పృహలేని స్థితిలోకి జారారు. డా॥ వారి, నాన్నను పరిశీలించి, యింక ఆశలేదని భావించి డా॥ చలపతిని అర్జం

టుగా రప్పించాడు ఆరోజు నాన్న మంచంమీద పడుండి తెలిలితేని పలవరింతలు పలుకుతుంటే మా అమ్మ ఏడ్చేది. చుట్టూ బంధువులు గుమిగూడారు. మా పెద్ద మేనమామ సూర్యనారాయణ కూడా వచ్చారు. అందరూ ఏదో గుస గుస లాడుకుంటున్నారు. మా నాన్న మరణం గురించి, ఆ విషయం మాకు తెలియకూడదని అయితే నాకు జరుగు తున్న సంగతులలో పరిణామాలు తెలుస్తూనే వున్నాయి. ఒక మధ్యాహ్నం వెళ్ళి శ్రీపాదదారి సందు దగ్గర నేను మా పెద్ద మామయ్యా నడిచి వెడుతుంటే ఆ సమయంలో ఒక వితంతువు ఎదురువచ్చి, ఇంకేముంది నాయనా అంతా అయి పోయింది. నరసింహం ఇక బ్రతకడనుకుంటా పాపం మీ మీద పడుతుంది. యీ సంసార భారమంతా అని సాగదీసుకుంది. ఆ మాటవిన్న నాకు సూలాలు గ్రుచ్చు కొన్నట్లయింది. లోలోపల చాలా బాధ పడ్డాను. చనిపోతున్న తండ్రి గురించి కంటె, బ్రతికివున్నవారి బ్రతుకు సాగు గురించిజనం బాధ పడడం మామూలే అయినా నాకదొక విచిత్రంలా కనిపించింది.

డా॥ చలపతి ఏర్పాటువల్ల ఆయన కారులో తన స్వగ్రామం ఆలమూరులో అంత్యక్రియలు జరగాలని అభి ప్రాయం వ్యక్తపరిచిన మా నాన్న అభిమతంపై వారు అందరూ బయలుదేరి వెళ్లారు. నన్ను విడిగా బస్సులో

తీసుకు వెళ్ళిన గుర్తు, మా అమ్మ, దొడ్డమ్మ, చెల్లెలు, ఇతరులు కారులో మా నాన్నతో వెళ్ళారు. మా మామ్మ మూర్తెమ్మగారు ముసలి. ఎనభై ఏండ్లు దాటిన వ్యక్తి చెముడు, మా నాన్న చనిపోతున్న వార్తవిని లబోదిబో మొత్తుకుంది. ఆలమూరులో మాఇంటి సావిడిలో ఆయన్ని పరుండ బెట్టారు. ఊరంతా ఇంటిముందుచేరి పరామార్శలు ప్రారంభించింది.

ఆయన్ను గురించి అందరూ పొగిడేవారే జాలిచూపే వారే రాత్రి పది గంటలకు ఆయన ప్రాణం పోయింది. ఇల్లు ప్రతిధ్వనించేలా ఆక్రందనలు చెలరేగాయి. దుఃఖం పట్టరాని ప్రవాహంతో మా అమ్మ దుఃఖంతో విలవిలలాడి పోయింది

తెలిసీ తెలియని పదేళ్ళ వయస్సులో వున్న నేను ఆ మరణం జీవితంలో సన్నిహితంగా ప్రథమంగా చూశాను ఎంతో చైతన్యంగా, నవ్వుతూ, నవ్విస్తూ, దబ్బపండులా మెరిసిపోతూ, ఉత్సాహంగా కనిపించే నాన్న చనిపోయి కొయ్యబారిన శవంలా పడుకోవడం ఆయనపై గుడ్డకప్పి, జనం ఏడ్వడం. నా బాల్యమనస్సు మీద పెద్ద అఘాతం ఏర్పడింది.

అంతవరకు ప్రపంచంలోకి చూస్తూ ఎన్నో ప్రశ్నలు

వేసుకుంటున్న నాకు, సమాధానాలు దొరకక అసందిగ్ధతలో వున్న నాకు, ఎక్కువ మౌనంగా జీవితం గడుపుతున్న నాకు తండ్రి మరణంలో సర్వాంగాలు, సర్వేంద్రియాలు, సంచలనంతో ఊగిపోయి హృదయంలో ఏవో భూకంపాలు కల్గినంత పనయింది. ఆ భూకంపాలు నా మనో నేత్రాన్ని తెరిచి విజ్ఞానం బాటవైపు నడిపించాయి. నిద్రాహారాలు లేకుండా రాత్రి అంతా శోకతప్త హృదయులైన బంధుజన పరివారం మధ్య కాలం గడిచింది బరువుగా భారంగా, తెల్లవారగానే తండ్రి దహన క్రియలకు సన్నాహాలు జరపడానికి బంధువులు ఉద్యుక్తులయ్యారు.

ఉషోదయం కాగానే ఇంటి దొడ్లో తులసిచెట్టు ప్రక్కన నాన్న శవం పరుండ బెట్టారు. అప్పటికే నాకు ఒడుగు కావటం వలన నన్ను అంత్యక్రియలు చేయాలని ఆదేశించారు. విచార వదనంతో, లేచి, తడిబట్టలతో శవంపై పూజలు చేయించారు ఆ శవం మొదటసారి చేతికి తగలగానే ఏదో విద్యుత్తు దుఃఖపాతం నాలో ప్రవేశించాయి. మనిషి జీవితం గురించి ఆలోచనలు చెలరేగాయి. జీవితం ఇంతే అనే భావనతో నాలో వైరాగ్య రేకలు అలుము కున్నాయి.

ఇంటినుంచి గోదావరీ తీరం వైపు నాన్న శవాన్ని తీసుకు వెళ్ళారు.

జ్యేష్ఠ పుత్రుణ్ణి కనుక నిప్పు పెట్టే బాధ్యత నాపైన పడింది. శవం ముందు నడచి గోదావరీ తీరంలో అన్నీ ఏర్పాట్లుచేసి, చితి పేర్చి, మంత్రాలకర్మకాండ జరిపించి చివరకు నా చేత నిప్పంటించ జేశారు. అగ్ని కీలలలో ఆయన శవం దహనం జరిగింది. కపాల మోక్షం అయేదాకా అంతా వేచి యున్నారు. తరువాత గోదావరిలో స్నానాలు చేయించి ఇంటికి తీసుకు వెళ్ళారు నన్ను.

అదొక విషాద ఏకాంత యాత్రలా కనిపించింది. జనం ఎంతమంది చుట్టూ ఉన్నా, అంతా చుట్టూ నిర్జన ఏకాంతం తాండవించి నట్టుంది. ఇంటికి రాగానే మా అమ్మగారి శోకాలు మిన్ను ముట్టాయి. అంతా జరిగిపోయింది. నరసింహం ఇక లేడు - అన్న భంధువుల ఉపశమన విషాద వాక్యాలు మారు మ్రోగాయి.

ఆ నాటి నుంచి పదిరోజుల దాకా ఆలమూరు గ్రామం లోనే వుండి పోయాం. ఎదురుగా వున్న దుడ్డువారి వైరం నాన్న మరణంతో ముగిసింది. వారు వచ్చి అమ్మని పరామర్శ చేశారు. మా మామ్మగారి శోకాలకు అంతే లేదు. నాకు కర్మ చేయకుండా చనిపోయావా నాయనా నాకింకా దిక్కెవరు ? అంటూ ఆమె లబోదిబో మొత్తుకుంది.

బంధువులు క్రమముగా అంతా వచ్చేశారు. పది రోజులు అక్కడ వుండటానికి ఉద్యుక్తులై వచ్చారు. అయితే తండ్రి మరణిస్తే ఆయన దహన క్రియలు చేయడానికి కూడా కానీలేని ఆర్థిక స్థితికి చేరింది. మా కుటుంబం అందువల్ల పెద్ద మేనమామ యీ వ్యవహారాలన్నీ చూచుకున్న గుర్తు చిన మేనమామ విజయనగరం నుంచి బయలుదేరి వచ్చారు యీ వార్తవిని-మా నాన్న ఆయన బంధువులుగా కాక. ప్రాణ స్నేహితులుగా వుండేవారు మానాన్న మరణం మా చిన మేనమామ రామమూర్తిగారికి విపరీతమైన విషాదం కలిగించింది ఆయనకు అప్పుడపుడు మతిభ్రమణం కలుగుతుండేది. ఆ విషాద భారంతో ఆయనకు మతిభ్రమించగలదేమోనని అందరూ భయపడ్డారు. చివరకు పదిరోజులు బంధు బలగాలు సంతర్పణ భోజనాలు చేసి ఎవరి దారిన వారు నిష్క్రమించ ఉద్యుక్తులైయ్యారు.

ఈ కుటుంబం ముందు గతి ఏమిటి అన్న ప్రశ్నకు ఎవరూ జవాబివ్వలేక అంతా దేవుడి ఇష్టం అన్నారు. ఈ కుటుంబ భారం కొంతకాలం తాను పూర్తిగా భరిస్తానని మా చిన మామయ్య రామమూర్తి ముందుకు వచ్చారు. ఆయన ఒంటరిగా బ్రతుకుతున్నారు. అప్పుడు భార్య చని పోయింది. పిల్లలు లేరు. అందువలన ఆయన నిర్ణయం అంద

రికి హార్షం కలిగించింది. ఆ నిర్ణయం వలన ఈ కుటుంబ భారం తమ మీద పడలేదని యితర బంధువులు సంతోషించరు. లేకపోతే అందరూ కలిసి తలో పది రూపాయిలు నెలకు చందాలు వేసి కుటుంబం కొంతికాలం పోషిస్తే బాగుంటుందనే ప్రతిపాదన బయలుదేరింది కూడా.

అప్పుడు నేను 4వ ఫారం చదువుతున్నా యస్. యస్. యల్. సి. పూర్తి చదువు కునేదాకా బంధువులు సాయం చేసి, ఒక కోమటి గుమాస్తా ఉద్యోగం యిప్పించి కుటుంబం పోషించుకోమని ఆదేశం అందివ్వాలని చర్చలు జరిపారు.

అయితే మా చిన మేనమామ విశాలహృదయంవల్ల ఆ పరిస్థితి రాకుండా - మా కుటుంబం ఆయన ప్రాపకం లోకి జారింది.

నాన్న చనిపోయాక కాకినాడ వెళ్ళి అక్కడి సామాను సర్దుకొని, విజయనగరంలో తను వున్న చోటికి అందరినీ రమ్మని మా చినమేనమామ ఆదేశించారు. అదే విధంగా నేను 4వ ఫారం పూర్తి చేసుకొని కాకినాడవదలి విజయనగరానికి మా మకాం మార్చాను. నేను మల్లమ్మ, చిన్న చెల్లి, తమ్ముడు- అంతా వెళ్ళాము ఆ వూరు.

మా పెద్ద అక్క కొన్నాళ్ళు మాతోవుండి కాపురానికి వెళ్ళింది.

నేను శనిదశాశేషంతో పుట్టానని, శనిదశ అంతం నాటికి మా నాన్న మరణం జరిగి. ఆ దశ ఫలితం పూర్తయిందన్నారు పెద్దలు - బాల్య దశలోని నా జీవితం ఒక క్రొత్తమలుపు తిరిగింది.